# గాలిమేడ.

గ్రంథకర్త:— వేదుల సత్యనారాయణశర్మగారు.

ఆంధ్రదేశీయు లందఱు బహువ్యాప్తమగు నవలాయుగములో మునింగియున్నారు. వంగదేశీయములగు నపరాధ పరిశోధకములు, చారిత్ర్యాత్మకములు, సాంఘికములు, పలురకముల నవలలు దేశమునంతట ముంచెత్తియున్నవి. కాని, యన్నిటి నొక్క యాకృతికిఁదెచ్చి కొలపోఁతలో వడపోయుటకే నవయుగాత్మకమగు 'గాలిమేడ' శపథము చేసియున్నది. 'గాలిమేడ' యన్న నపోహా విహీనమగు స్వేచ్ఛాపరిణయము, స్త్రీ స్వాతంత్ర్యము, ప్రస్తుత విద్యాపరిపోషణము, ప్రస్తుత భాష, నవనాగరకతావేషము, ఆవేషభాషలలోనే రాధవలపు, యశోదబులుపు, క్రొత్తయల్లుని చట్కాలీలలు, పూర్వాచార పరాయణుల సైద్ధు, పంతులు కామరాజు వన్నుమోరులతో - ఏమనుకొన్నారు? - గాలిలో మేడ - కల్లయనియా! ధగద్ధగాయమానమగు విద్యుద్దీపములకాంతి ప్రతిఫలించు కృష్ణారావు సభాసందర్భ మాచంద్రతప్తాసారమునా! రాధసొంపు, కథలోఁగథ, భాష గుమాయింపు— సెట్టి డబాయింపు, పెళ్లిళ్ల ప్రస్తుతరూల్సు, చదివితే తెలియును. విమర్శకాదు. ఖండన పేరే మఱచినది. నిస్సందేహమగు మాతృభాషకు శ్రీలిబిడ్డ. పత్రికల తర్వాత చదువఁదగు విశేషము లీమేడలోనే ఉన్నాయి. క్రొత్త నవలలు, వింతైన నవలలు, చదువరుల యాత్మలు కథయందు లీనమగుచుండును.

తప్పక చదువఁదగిన నవల.

వెల రు. 0—12—0.

వలయువారు:—

కర్రా అచ్చయ్య అండు సన్స్,

ఈశ్వర బుక్కు డిపో,

రాజమండ్రి.

# విషయసూచిక.







# శిథిలగృహరహస్యము.



## దోఁపిడీ.

రాత్రి పదిగంట లయ్యెను. నాఁడు త్రయోదశి. కృష్ణపక్షము. చీఁకటులు గాఢముగ నలుదట్లఁ గ్రమ్ముకొనియుండెను. లోక మంతయు నిర్మానుష్యమయ్యెనో యనునట్లు మానవు లందఱును నిద్రాముద్రితులైరి. పశుపక్ష్యాది సమస్త జీవరాసులును దమతమ నివాసంబుల సుఖనిద్రఁ జెందుచుండెను. అక్కడక్కడ గుడ్లగూబలు, తలక్రిందుపక్షులు మాత్రము సంచారము చేయుచుఁ దమ రెక్కల చప్పుడులతోను, వికటస్వరములతోను యానిశ్శబ్ద నిశీథమును భేదించుచుండెను. జారచోరాదిదుర్జన సంతతుల కమితానంద మొనవఁజేయు నానిశీథమున మానవమాత్రులు సంచరింప సాహసింపఁ జాలరనుట యతిశయోక్తి కానేరదు. సహజముగాఁ గృష్ణపక్షమునఁ జంద్రకాంతి లోపించినను నిర్మలాకాశవీథినిఁ దారలు వెలుఁగుటవలన నించుక వెలుతు రుండుట సహజము. కాని, నాఁటిరాత్రి గగనమార్గ మంతయు మేఘచ్ఛన్న మగుటచే నావెలుతురునకుఁ గూడ నవకాశము గాన్పించుటలేదు. మబ్బులు దట్టమై నీలవర్ణముగల గగనకాంత చోరుల కుపయుక్తముగా నుండునటుల కృష్ణవర్ణ ధారిణివలెఁ జూపట్టుచుఁ బాంథుల కత్యంతభీతి నొదవించుచుండెను.

అట్టి నిశీథసమయమునఁ గూనవరమునుండి భద్రాచలముపోవు డి. పి. డబ్లియు రోడ్డుపై నొక రెండెడ్లబండి మందగమనముతోఁ

పోవుచుండెను. బండిలో నిరువురుపురుషులు, ముప్వురు స్త్రీలు నుండిరి ఆపురుషులలో నొకఁడు వయసు ముదిరినవాఁడు. సుమా రేఁబదియేండ్లు దాఁటియుండునని యాతని నెరసినవెంట్రుకలు, ముడుతలు పడిన ముఖము చెప్పుచున్నవి. రెండవపురుషుఁడు లేఁతవయస్సువాఁడు, ఇరువది వత్సరములకంటె నెక్కువ యుండవు. అతఁడు చాల సుందరపురుషుఁడు, ధైర్యసాహసోద్రేకునివలెఁ జూపట్టుచుండెను. స్త్రీలు పరుండియుండుటచే వారిని బాగుగఁ బరిశీలించుటకు మన కవకాశము లేదు బండితోలువాఁడు యావనుఁడు. సుమారు నలుబదివత్సరముల వయస్సుండును. మంచిశరీరసౌష్టవము, సమున్నతదేహము కలిగియుండెను. అతని ముఖమున ధైర్యము, గాంభీర్యము తొలుకాడుచుండెను. అతఁడెద్దుల నేమియు మందలింపకుండ నిశ్శబ్దముగఁ జుట్ట కాల్చుకొనుచుఁ గూరుచుండెను. ఎద్దులుకూడ శాంతతతో నెమ్మదిగ నడుచుచుండెను.

బండిలోని వృద్ధుఁడు మాత్రము చిత్తశాంతత లేకుండ నుండెను. అతఁ డామార్గమునఁ జాలసారులు ప్రయాణము చేసియుండెను. ఆబాట మధ్యమున నప్పు డప్పుడు బందిపోట్లు జరుగుచుండుటకూడ కలదు. ఆబందిపోట్లుఒకానొక సమయమున హత్యలుగాఁగూడఁబరిణమించినవి. ఇట్టి భయంకరసంఘటనము లావృద్ధుఁ డెన్నియో మారులు వినియుండెను. అందుచే నాతఁడుఁ భయభ్రాంతుఁడగుచుండెను.

ఆబాటకూడ చోరులకు, హంతకులకు నివాసయోగ్యము. అక్కడక్కడ కోయగ్రామము లున్నను చాలభాగ మరణ్యమధ్యమునందే యున్నది. అరణ్యముకూడ నక్కడక్కడ బాగుగఁ బెరిగి దట్టమై పట్టపగలుకూడ పాంథులకు భీతి గొల్పుచుండును. అట్టిచో నీనిశీథసమయమున మేఘావృతమైయున్న యీకాళరాత్రియం దెంతభయానకమై యుండునో యూహించినఁ బ్రతిమానవునకును దెలియఁగలదు. ఆ యరణ్యములఁ ఘోరభయమేకాక వ్యాఘ్రాది క్రూరజంతుభయము

కూడ విశేషముగ నుండెను. ఆ క్రూరజంతువు లచ్చటనున్న యాట
విడుల పశుసంతతి నంత నొందించుటయేకాక యప్పుడప్పుడు రాధా
కడ్డమై మానవరక్తపానముగూడ గావించుచుండెను. ఈవిషయము
లొక్కటొక్కటిగా నావృద్ధుని మానసమును గలంప మొదలిడెను.

బండి కూనవరమున బయలుదేఱునరికే పదిగంట లయ్యెను. దాని గమనముకూడ మందమై గంటకు మైలున్నర కంటె నెక్కువ యుండదు. బండివాఁడు వృద్ధుని పోరుపడలేక యెడ్ల నించుక హెచ్చరించుచున్నను యవిమాత్రము వాటిసహజగమనము మాత్రము విడుచుటలేదు. ఎట్టులో రాత్రి రెండుగంటలకా బండి కూనవరమునకుఁ బండ్రెండుమైళ్ళ మారమునన్న మురుమూరుగ్రామము చేరెను. అంతవఱకును నిద్రలేకుండుటచేత నాయువకుఁడు కునికిపాట్లు పడుచుండెను. పాపము భీతహృదయుఁడగు నావృద్ధునికిమాత్రము నిద్ర వచ్చుటలేదు. యువకుని యవస్థ చూచి యాతఁడు "నాయనా! సర్వేశా. కొంచెమునేపు పరుండుము, నిద్రలేకున్న నీకు జబ్బుచేయఁగలదు" అనెను. ఆ పలుకులకుఁ దెలివి గాంచి యా యువకుఁడు "అక్కఱ లేదు. మామగారూ! నా కేమియు భయము లే"దనెను. అంతటితో వృద్ధుఁ డూరకుండక "కొంచెము పొడుము పీల్చు"మని పొడుముఁ డబ్బీ నం దిచ్చెను.

యువకుఁడు పొడుము పీల్చుచు "మామగారూ! బండివానిని గొంచెము తొందరగా తోలుమని చెప్పండి. ఇప్పటి కింకను సగము దూరమైన రాలేదు," అని చెప్పి చేతిగడియారము జూచి "అబ్బా! రెండుగంటలైనది. ఈలెక్కను చూచుకొన్న చోఁ దెల్లవారునరికి గుండాల పోవుటకూడ కష్ట" మనెను.

బండివాఁడు కదలక నిద్రించుచుండెను. అతని లేపవలయునని యావృద్ధుఁడు ప్రయత్నించెను. కానీఁ యాతఁడు లేవలేదు బండి నెమ్మ

దిగా మఱియొకగంటకు గౌరిదేవిపేట దాఁటెను. ఆగ్రామము రోడ్డునకు సుమారు అరమైలుపైగా గోదావరియొడ్డువైపున నున్నది. ఆయూరు దాఁటినవెంటనే యొకవాగు కలదు. బండి యావాగుదరికి వచ్చునరికి యకస్మాత్తుగ నిలచిపోయెను. బండిలోని వృద్ధుఁ డదరిపడి బండివానిని గట్టిగ లేపెను. వెనుకనున్న యువకుఁడు తనచేతనున్న యంత్రదీపికా Batherey light సహాయమున నాబండిముందుఁగల చీఁకటినిభేదించెను. అచట నే మున్నది ? ఇరువురు పురుషులు వచ్చుచుండిరి. అందొకఁడు "యీబండి యెవరిది" యని ప్రశ్నించెను.

యువ:—మాది కూనవరము. భద్రాచలము పోవుచుంటిమి. బ్రాహ్మణులము.

పురు:—ఒంటరిగా బయలుదేఱి రేమి?

యువ:—ఒంటరిగా కాదు ఈబండిలో మామామగారు దామోదరశాస్త్రిగారుకూడ నున్నారు. మావెనుకనే మఱియొకబండి కూడ వచ్చుచున్నది.

పురు:—అటులయిన భయము లేదు. కాని ఆబండికూడ వచ్చుట కాఁగిపోవుట మంచిది.

అసలే భీతుఁడై యున్న యాదామోదరశాస్త్రి యీపలుకులు విని మఱింత భీతుఁడై "అయ్యా ! పుణ్య ముంటుంది. కొంచెము మీకు దారిలోఁగనిపించినఁ దొందరగా రమ్మనియాబండిలోనివాళ్ళతోఁ జెప్పండి" యనెను.

ఆపురుషుఁడు సరే యని తనతోఁగూడవచ్చిన వానితోఁగూడ బయలుదేఱి వెడలిపోయెను. వారు వెళ్ళినతరువాత యావృద్ధుఁడు "సర్వేశ్వరరావూ ! మంచియుక్తి పన్నినావోయి. వెనుక బండి యున్నదని చెప్పకపోయినచో వీరిద్దరు మనపని పట్టెడివారే" యనెను ఇంతసంభాషణ జరిగినను యాబండివాఁడు లేవలేదు. లేపవలెనని చేసిన

ప్రయత్నములుకూడ వ్యర్థమయ్యెను సర్వేశ్వరరావు ప్రాణములు విసిగి తానే బండి త్రోలుట యారంభించి యెద్దులను వడిగా నడిపింప సాగెను. క్రమమున నాబండి నెలపొడుచునమయమునకు దేవరపల్లి గుట్టను చేరెను. అప్పటికి నెలపొడుచుట కింతయో యాలస్యము లేదు. సర్వేశ్వరరావు బండిత్రోలుట ప్రారంభించినంతనే లోపలను ౨ దామోదరశాస్త్రికూడ పరుండి నిద్రపోయెను.

గుట్టను సమీపించునరికి బండితోలుచున్న సర్వేశ్వరరావు హఠాత్తుగా కెవ్వు మని కేక వైచి వెనుకకు సోలిపోయెను. ఆహా టున కులికిపడి బండిలో నిద్రించుచున్న దామోదరశాస్త్రి, స్త్రీలు కూడ మేల్కాంచి యేమి, యేమి యని కంగారుపడసాగిరి. సర్వేశ్వ రావు నోట మాటలేదు. దామోదరశాస్త్రియెట్టయెదుట పదిమంది మనుజులు పెద్దపెద్దకఱ్ఱలను చేతఁబూని నిలువబడియుండిరి. అందొ కడు ముందునకు వచ్చి గంభీరనిస్వనముతో "బండి దిగండి" యనెను. ఈయలజడికి బండివాడు లేచి పారిపోయెను.

ఎదుట పదిమందిమనుష్యులు-తా మున్నది యిద్దరుమాత్రమే. బండివాడుకూడ పారిపోయెను. గత్యంతరము లేక సర్వేశ్వరరావు, దామోదరశాస్త్రియు, బండి దిగిరి. కాని అంతమాత్రములో వారు తృప్తిపొందక స్త్రీలనుకూడ బండి దిగు మనిరి. పాపము వా రేమి చేయగలరు? ధిక్కరించి పదిమందితో పోరుట దుర్ఘటము. ఏమి చేయ గలరు? కేక వేయుటకైనను రెండుమైళ్ళలోపుల గ్రామము లేదు. సమీపమున పొలము లైనను లేవు. అందరును బండి దిగిరి.

దొంగలనాయకుడు బండియందుగల పెట్టె లన్నియు తెరచి యందలి వస్తువులన్నియు గైకొనెను. స్త్రీల యొడలిపైనున్న యాభ రణంబు లన్నియు దీయించి భద్రపరచుకొని "ఇక మీరు పోవచ్చును. కాని ఎవ్వరితోనైన నిట్లు దోచబడితి మని చెప్పినచో మీప్రాణములు

మీకుc దక్క" వని గద్దించెను. వారు చేయునదిలేక బండి నెక్కి దర్రివ్యము పోయినను ప్రాణములు దక్కెను. అంతియ చాలు, జీవించి యున్నచో మరల నెప్పటికైన ధనము సంపాదించుకొనవచ్చు నని తలంచుచు, మారుపలుకక, మరల నెట్టిప్రమాదము తటస్థించునో యను భయముచే బండిని పరువెత్తించుచు నుదయ మేడుగంటలకు భద్రాద్రి చేరిరి. దేవరపల్లిగుట్టనుండి బయలుదేరినది మొదలు భద్రాచలము చేరువరకు నొక్కరును నిద్రపోలేదు.

---

# పులిమీదపుట్ర.

దామోదరశాస్త్రి భద్రాచలము చేరకముందే దేవరపల్లిగుట్ట వద్ద దొంగలు, పాప మెవరో బండిపై వచ్చుచుండ దోచికొని రని యాపట్టణమందలి యాబాలగోపాలమును చెప్పుకొనసాగిరి. క్రమమున నీవార్త పోలీసులకుకూడ తెలిసిపోయెను.

పోలీసుస్టేషనులో డి వై. యస్. పి దొరగారు (డిప్యూటీసూపరింటెండెంటును ,న్సిపెక్టరు రంగనాథమూర్తిగారును కూర్చుండి, గతరాత్రిజరిగిన బందిపోటుసంగతియే మాట్లాడుకొనుచుండిరి.

సూపరెన్టెండెంటు:—రంగనాథం! నాఅల నీ చిచ్చులపిడుగు వచ్చిన దేమోయి! ఈదుర్మార్గుల నీసారియైన పూర్తిగ పట్టుబెట్టక పోయినచో బాటసారులకు గాని, గ్రామవాస్తవ్యులకు గాని శాంతి కలుగ నేరదు.

రంగ—చిత్రము. మొన్నటికేసులలోనే మన డిటెక్టివునహాయము గైకొని పనిచేసినచో నింత విపరీతముగాని మరల నీఘోరముగాని జరిగియుండదు కదా!

సూప—మించినదానికి వగచిన ప్రయోజన మే మున్నది? ఈసారి తప్పక యొకడిటెక్టివును పంపవలెనని వ్రాయుదము.

వా రిట్లు మాటలాడుచు డగనే యొక రెండెడ్లబండి వచ్చి స్టేషనుముందు నిలచెను. ఆబండిలోనివారు మనకు పూర్వపరిచితులగు దామోదరశాస్త్రి వగైరాలని చెప్ప నక్కరలేదు. వా రందరును బండి దిగి లోనికి పోయిరి. సూపరెంటెండెంటుదొరగారు వారల జూచినంతనే దొంగలచే నాటంకపరుపబడిన నిర్భాగ్యులు వారే యని తలంచి రంగనాథమూర్తివైపు చూచెను. అతఁడుకూడ దొరగారి యభిప్రాయ మెరింగి దామోదరశాస్త్రివైపు తిరిగి, "శాస్త్రిగారూ! ఏమి జరిగినదంతయు నవిస్తరముగ చెప్పండి. రిపోర్టు వ్రాసి పైకి పంపెదము. మీపోయిన యాస్తి చీపురుపుల్లతో సహితముగ మీకు ముట్టఁ జెప్పించెదము." అనెను.

శాస్త్రి కొంచెము గద్గదస్వరముతో "అయ్యా! మాది నైజామురాజ్యములోని పాకశాల గ్రామస్థలము. ఈమధ్యనే నాకుమార్తెకు వివాహము చేసి మనుగుడుపులకొరకై అత్తవారింటికి పంపితిని. మొన్నను వెళ్ళి తిర్గి వారి నందరను తీసికొనివచ్చుచుంటిని. కూనవరములో బయలుదేరుసరికి పదిగంటలు దాటినది. రాత్రి సుమారు రెండుగంటలకు గారిదేవిపేట వచ్చితిమి. అచ్చట నెవ్వరో యిరువురు మనుష్యు లెదురుపడి దారిలో జాగ్రత్తగ పొం డని హెచ్చరించుచు బండి వెనుక పదినిముషములు నిలబడి మాటలాడిరి. వారు చాల పెద్దమనుష్యులనియే వారిసంభాషణనుబట్టి యూహించితిము. మేము బాడిగకు కట్టించుకొనిన బండివాఁడు కదలక మెదలక నిద్రించుచుండెను. తరువాత

మాయల్లుడు బండితోలుట ప్రారంభించెను. దేవరపల్లి గుట్టవద్దకు వచ్చు వఱకి సెల పొడుచుటకు సిద్ధముగనుండెను. అప్పుడే నాకు కొంచెము కునుకు పట్టెను. కాని మాయల్లుని కేక విని లేచితిని. ఎదుట పదిమంది దొంగలు దుడ్డుకఱ్ఱలతో నిలువబడియుండిరి. మాక గాదు చూచి బండివాడుకూడ పారిపోయెను. మాకు గత్యంతరము లేక వారు చెప్పి నట్లెల్ల నొప్పుకొనవలసివచ్చెను. వాళ్ళయాజ్ఞపై మే మందరమును దిగితిమి. ఆదొంగలు మాపెట్టెలోని వస్తువులు ధనముకూడ భద్రపరచు కొని, స్త్రీలు ధరించిన యాభరణములుకూడ నొలిచికొనిరి. కాని దైవ కృపవలన ప్రాణములనుమాత్రము కాపాడిరి. బ్రతుంకు జీవుడా యని బండి నెక్కి ప్రయాణమైతిమి. ఆదొంగలు నగలు వగైరాలు మూట కట్టుకొనిపోవుచు దొంగలు దోచిన ట్లెవ్వరితోనైన చెప్పినచో మీ ప్రాణములు దక్కవని బెదరించిరి. మేము మారాడక వేగముగ నా బండి తోలుకొని యిచ్చటకు చేరితిమి. బాబూ! మాకు చాలభయ మగుచున్నది. మ మ్మెట్లైన సుఖముగ మాగ్రామముచేరు నుపాయము చేయుడు. మా కంతియ చాలును.'' అనెను.

ఇన్స్పెక్టరు శాస్త్రి చెప్పిన దెల్ల వ్రాసికొని "అయ్యా! బండిలో నున్న జనము, వారివారిపేర్లు, వారికిని మీకునుగల బాంధవ్యము వగైరా లన్నియు సవిస్తరముగా చెప్పండి. మీ కేమియు భయము లేదు. మిమ్ము సుఖముగ మీగ్రామము చేర్చెద'' మనెను.

దామోదరశాస్త్రి యిట్లు చెప్ప దొడంగెను. "ఇది నాభార్య- పేరు సత్యవతి. ఇది నాకుమార్తె-పేరు లలిత. ఈమెకే మొన్న వివాహ మైనది. ఈమె మాయల్లుని తోబుట్టువ-పేరు లక్ష్మీకాంతమ్మ. ఇతను నాయల్లుడు- సర్వేశ్వరరావు.

ఇన:— మీపేరు చెప్పండి.

దామో:— దామోదరశాస్త్రి అంటారు.

ఇనః— పోయినవస్తువుల వివరముకూడ చెప్పాలి.

దామో— చెపుతా బాబూ! ఒక్కొక్కటి పదికాసుల ఎత్తుగల రెండు కంటెలు. అం దొకదానిమీద "కొ॥ న" అని పొడియక్షరములు కలవు. ముప్పదికాసులయెత్తుగల ముద్దబల్ల దాణము ఒకటి—దానిమీద 'మం. న' అను అక్షరములు కలవు. రెండుజతల దుద్దులు, ఒకజత చంపస్వరములు, ఎనిమిదికాసులు ఎత్తుగల డాలరుగొల్సు ఒకటి—దాని మీదకూడ 'మం. న' అని పే రున్నది.తరువాత ఒక వెండి మరచెంబు 60 తులాలు, వెండికంచము 40 తులాలు, మూడు వెండిగ్లాసులు ఏడేసితులా లవి. అం దొకదానిమీద 'భ ॥ ల' యనియు కలవు. ఒకదానిమీద పేరు లేదు.

ఇన—ఇంతేనా పోయిన ఆస్తి? క్షొఖ మెంత యుంటుంది?

దామో—నూట ముప్పదియైదు వెండిరూపాయిలు 'భ ॥ ల' అని పేరుకల్గియున్న గ్లాసులో పోసితిమి. అది పోయినది.

ఇన—సరే. చాలు. దీనిమీద మీరున్ను, మీ అల్లుడు గారున్ను సంతకములు చెయ్యండి. అని కాగిత మిచ్చెను.

ఇరువురును సంతకములు చేసిరి. ఇనస్పెక్టరు దానిని మడచి సూపర్నెంటుగారిబల్లపై నుంచెను. ఒకపోలీసుజవానును పిలచి 'వీరిని తీసుకపోయి సూపర్నెంటుగారి బంగాళావెనుకనున్న సత్రింలో బస యేర్పాటుచేసి రమ్ము. రాత్రి యిరువురు జవానులు వారివద్ద కాపుండ వలయును. బండి, యెద్లు స్టేషను దొడ్డిలో పెట్టండి. రెండుమోపుల గడ్డి తెచ్చి యెద్లకు వెయ్యండి' యని చెప్పెను.

జవాను ఇనస్పెక్టరు చెప్పినట్లు చేసెను. నాటిపగలు గడచెను. రాత్రి యిరువురు పోలీసు లచ్చట కావలియుండిరి.

సగము రాత్రి గడచెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను.

అంతలో లోపలనుండి దామోదరశాస్త్రి గుండెబాదు కొనుచు నీవ లకు వచ్చి, 'కొంప మునిగినది. ఇంకే మున్న దని రోదనము చేయ సాగెను. అందరును లేచిరి. రక్షకభటులు, కారణ మేమైయుండునా యని యాలోచింపసాగిరి. ముగ్గురు స్త్రీలలో నొక స్త్రీ కనపడుట లేదు. వెంటనే యొకజవాను పరుగుపరుగున పోయి సూపరింటెండెంటు దొరగారిని లేపెను. వారు వచ్చి విషయ మంతయు తెలిసికొని చాల వింతగ నున్నది. దోపిడిదొంగలు ధనము నపహరించుట కలదు గాని, స్త్రీలను దొంగిలించుట యింతవరకు చూడలేదు. పాపము మీకు ధననష్టముకన్న నెక్కువై పులిమీద పుట్రవలె నిది యొకవిపత్తు తటస్థించినది.' అని పలుకుచు వారి నందరను తన యింటికి తీసుకపోయి, వారు పరున్నగదికి తాళము, సీలు వేయించి శేషరాత్రి గడపిరి.

---

# క్లోరోఫారప్రభావము.

మరునాటియుదయమున సూపరింటెండెంటు దొరగారు, సర్జను దొరగారు, ఇనస్పెక్టరు రక్షకభటసహితులై గడచినరాత్రి దామోదర శాస్త్రి వగైరాలు పరుండిన గదియొద్దకుబోయిరి. సూపరింటెండెంటు వారియుత్తరువుపైనాగది తెరువబడెను. ఇంతలో వారిపనుపున బోయిన రక్షకభటుడు దామోదరశాస్త్రినీ,యాతనియల్లునిగూడ గొనివచ్చెను. అందరును లోన ప్రవేశించిరి. ఆగది నాలుగుమూలల పరికించిరి. కాని,

శాస్త్రిగారి పెట్టెలు తప్ప యేమియు గాన్పింపలేదు. సూపరింటెండెంటు దొరగారు శాస్త్రివైపు చూచి "అయ్యా! మీా రెవ రెవ రెక్కడ పరుండిరో తెలుపగలరా?" యని ప్రశ్నించెను.

దామో:—తెలుప లేకేమి? దక్షిణవైపుగోడవద్ద నేను నా అల్లుడు పరుంటిమి. రెండవవైపున నాడువారు ముగ్గురును పరుండిరి.

సూప:—మాయమయిన స్త్రీ మీాయల్లుని సోదరి కాదా? ఆమె మధ్య పరుండెనా?

దామో:—లేదు, నాకుమార్తె మధ్య పరుండెను. కుడివైపున తల్లియు, యెడమవైపున నాడుబిడ్డయు పరుండిరి.

సూప:—సరే. ఆమెయే యీా ద్వారమువైపు నిద్రించిన దన్నమాట. ఆమె వయస్సెంతయుండును.

దామో:—సుమారు—అని అల్లునివైపు చూచును.

సర్వే:—పదహారువత్సరములు.

సూప:—మీాపెట్టెలోని వస్తువులన్నియు సరిగ నున్నవో లేవో చూచుకొనుడు.

దామోదరశాస్త్రి పెట్టెల నన్నిటిని తెరచెను. అన్నిటిలోను సామానులు, బట్టలు వగైరాలు యథాస్థానమం దుండెను. ప్రతిమడతయు బాగుగ పరిశీలంప మొదలు పెట్టెను.

ఈలోపున సూపరింటెండెంటుదొరగారు ఏదియో యాలోచించుచు తలుపులు కిటికీలు పరిశీలింపసాగెను. ఆకస్మికముగ నొక తలుపుమీాద నున్న యొకతెల్లనివస్తు వాతనిదృష్టి నాకర్షించెను. వెంటనే దానిని సమీాపించి పైకితీసెను. దానిని బాగుగ పరిశీలింప నొకమూల "మం. స" అనియున్నది. దానిం గైకొని వచ్చి పెట్టెలు పరిశీలించుచున్న శాస్త్రికి చూపి "యీాజేబురుమా లెవరి ద"నెను. సర్వేశ్వరరావు దాని నందికొని బాగుగ జూచి "ఇది నాదియే. దీనిని కూన

వరములో బయలుదేరునప్పుడు మాచెల్లెలి కిచ్చితి” ననెను. సూప రింటెండెంటుచిరునవ్వుతో “పెళ్ళివారి రుమాళ్ళపై సుగంధ ద్రవ్యములు విస్తారముగ నుండు” నని యారుమాలును ముక్కునొద్ద నుంచుకొని పీల్చెను. ఆశ్చర్యము. సుగంధద్రవ్యములమాట దైవ మెరుగును. దొరగారు జోగుచు, తూలుచు క్రిందబడిపోవుచుండెను. అది గాంచి రంగనాథమూర్తి దొరగారిని పట్టుకొని, రుమాలు తీసి పారవైచి డాక్టరుగారిని పిలిచెను. డాక్టరుగారా రుమాలు పరిశీలించి వెంటనే యొకచీటిపై నే మేమో వ్రాసి యొక జవానుకిచ్చి, “తక్షణము యీ చీటి కంపౌండరుకు జూపి యాతడిచ్చిన మందు తీసికొని రమ్ము. సైకిలు మీద రావలయు” నని చెప్పి దొరగారిని వరండాలోనున్న బల్లపై పరుండజేసెను. రంగనాథరా వాత్రముతో ,,ఏమండీ! ఇలా కావ టానికి కారణమేమిటి” యనెను. డాక్టరు ‘మరేమియు ప్రమాదము లేదు. ఆరుమాలుపై క్లోరోఫారము చల్లబడిన’దనెను. క్లోరోఫారము పేరువిన్నంతనే సర్వేశ్వరరావు నిర్ఘాంతపడి పోయెను. ఇంతలో నాసు పత్రికి పోయిన రక్షకభటుడు మందుసీసాతో ప్రవేశించెను. డాక్టరా మందును దొరగారి రెండుముక్కులందును రెండుచుక్కలు వేసెను మరిరెండు నిముషములలో నాతఁడు లేచి కూర్చుండెను. వెఱ్ఱివాని వలె నలుదెసలు పరికించి ‘నాచేతిలోని రుమా లేమైన’ దనెను. డాక్టరా రుమాలును చూపించుచు జరిగినదంతయు తెలిపెను. దొరగా రుత్సాహముతో ‘అయిన నది మన కుపకరింపగలదు’ అనెను.

ఇంతలో దామోదరశాస్త్రి వణఁకుచు నొకకవరు దెచ్చి దొరగారి కిచ్చుచు, ‘బాబు! దొరగారు! ఇది మా సర్వేశ్వరుని పెట్టె లో నున్న’ దనెను. దొరగా రది తీసికొని పరికింపగా దానిపై నొక వైపున దామోదరశాస్త్రిగారి చిరునామా వ్రాయబడియుండెను.

దొరగారు రాకవరు చించి లోపలనుండి నొకయుత్తరము తీసి యిట్లు చదువఁ దొడంగెను.

"మహాశయా!

ప్రపంచమునగల ప్రతిమానవునకును ముఖ్యావసరమైనవస్తువులు రెండు. అందు మొదటిది కాంత. రెండవది కనకము. ఈరెంటికిని యవినాభావసంబంధము కలదు. రెండును నొకస్థలమున నున్నప్పుడే యవి రాణించును. మీదయవలన నాకు కనకమునకు లోటు లేదు. ఇప్పటికి నాగృహమున నాల్గుకోట్లురూప్యముల విలువగల ధనవస్తుసముదాయములు గలవు. ఇక నాకు ధనముతో పనిలేదు. కాని చాలదినంబుల నుండి నాయభీష్టసిద్ధి చేకూర్చెడి కాంతకై వెదకుచుంటిని. దైవకృప వలన నేటికది కూడ సమకూరెను. ఇక నాకు చోరత్వముతో పనిలేదు. ఇదియే నాకడపటికార్యము. ఇంతటినుండి నావలనఁగాని నాయనుచరుల వలనగాని లోకుల కెవ్వరికిని యేవిధమైన హానియు కలుగ నేరదని త్రికరణశుద్ధిగా చెప్పఁగలను.

"M. R."

ఆయుత్తరము వినుసరికి సర్వేశ్వరరావు దుఃఖాతురుఁడై బోరున నేడ్వసాగెను. దుర్మార్గులగు నానరహంతకుల బారింబడి తనసహోదరి యెట్టి యిక్కట్టులకు లోనుగావలసివచ్చునో యని యాతని హృదయము తల్లడిల్లసాగెను. సూపరింటెండెంటు వగైరాలందర రాతని నోదార్చిరి. ఎట్టకేల కాతఁడు ధైర్యము తెచ్చుకొని 'దొరగారూ! మమ్మెట్లీ విపత్తులనుండి రక్షించెదరో మీదే భారము. పాపము నా చెల్లెలెన్నడును నెండ కన్నెరుగని సుకుమారి. ఆకలి చెంబీకలనైన బెట్టి యెరుఁగదు. ఈహంతకు లామె నెట్లు బాధింతురో, ఆమెను కాపాడుభారము మీయది. ఈయభియోగమున నెంతసొమ్మైనను వెచ్చింప వెనుదీయను. ఆదురాత్ముల నందఱఁ బట్టి తగునట్లు శిక్షింప

వలెను. నీట ముంచినను, పాల ముంచినను మీదే భార' మని యింకను యేమేమో చెప్ప దొడంగెను. కాని యధికారుల యాజ్ఞవలన నాతఁడూరకుండెను.

దొరగారు, 'శాస్త్రిగారూ! మీరు మీయూరునకు పొండు. కొలదిరోజులలోనే మీద్రవ్యముతో పాటు ఆమెనుగూడ మీకు నప్పగించెద' మని నచ్చబల్కి యిరువురు రక్షకభటులతోడొసఁగి వారి నందర నెల్లిపాక పంపింపై చెను. వెంటనే వ్రిభుత్వమువారికీ దోపిడి సమాచార మంతయు రిపోర్టు వ్రాసి సమర్థుడగు నపరాధపరిశోధకునిఁ బంపవలసినదిగా కోరుచు టపా పంపించి యాకవరుత్తరము, జేబురుమాలు స్టేషనులో భద్రపరచియుంచెను.



# పరిశోధన.



వారమునాటికి పత్తేదారు కమలాకరము భద్రాచలము చేరెను. ఆతనిరాక విని పోలీసుద్యోగస్థు లెల్ల రెదురేగి సగౌరవముగ తోడ్కొనివచ్చి యొకభవనమున బస యొసంగిరి. నాడు మధ్యాహ్నము సూపరింటెండెంటు వగైరా లందరును కమలాకరుని భవనము చేరిరి. వారందరును చేరి యీయభియోగవిషయమై చర్చింప మొదలిడిరి.

కమ.—దొరగారూ! మీ రికార్డులన్నియు దెచ్చినారా?

దొర.—తెచ్చినాము. అని రంగనాథమూర్తివైపు చూచెను. రంగనాథము జేబులోనుండి యొకకవరు తీసి కమలాకరున కందించెను. అత డదిగైకొని యందలి సారాంశ మెల్ల బాగుగ చదివెను. తరువాత నాజేబురుమాలువిషయమై సూపరింటెండెంటువల్ల తెలిసికొని "బాగుగనేయున్నది. ఈకవరుపై నున్న పర్వతశ్రేణి కర్థ మేమో యూహించితిరా?" యని ప్రశ్నించెను. కాని దానియభిప్రాయము వారి కెవ్వరికిని గోచరింపలేదు. కమలాకరము "దొరగారూ! హంతకుఁ డిట్లు ప్రదర్శించుట తన నివాసస్థలము పర్వతమధ్యస్థ మని సూచించుచున్నది. చూడు డీమూలలయందు చిన్నయక్షరములతో C. P. యని యున్నది. ఇది యాహంతకులలో నొకని పేరుగాని, లేక యీకవరులు ముద్రించిన ఆఫీసుపేరుగాని యైయుండవలయు. ఇది కూడ మన కీయభియోగమున సహకారి కా గలదు. మరి యొకవిషయము. ఆయువతి యపహరింపబడిన గదిలో మరల నెవరైన బస చేయుటకాని, లేక శుభ్రపరచుటకాని జరిగినదా?" యని ప్రశ్నించెను.

రం.—లేదు. అది నాటినుండి నేటివరకును సీలు వేయబడియే

యుండెను. మీ కాగదియం దింకను సూక్ష్మములగు నాధారములు దొరకవచ్చు నని యట్లు చేసితిమి.

కమ—మంచిపని చేసితిరి. ఒకమా రాగది తిలకించి వత్తము.

అందరును లేచి యాగది వద్దకుపోయిరి. బీగము తెరువబడెను. కమలాకరము లోన ప్రవేశించి గదియందలి ప్రతి స్వల్పవిషయమును పరిశీలింపసాగెను. అట్లు చూచి చూచి వారు తెరచినద్వారము నవిగా పించి యాకస్మికముగ 'చోరు డామె నీమార్గమునవే తీసికొనిపోయె' ననెను. అందరు నిర్ఘాంతపడి 'యెట్లు చెప్పగల' రనిరి. కమలాకరము చిరునవ్వుతో 'ఈతలుపెందుకు చూడుడు. ఈతలుపునందున చిక్కుకొని యున్నది. ఆమె స్పృహ కల్గి యీద్వారము వెంబడి యెన్నిసారులు నడచినను యీతలవెంట్రుక యిట్లు చిక్కుకొనుట కవకాశము లేదు. ఇతరులు మోసికొని పోవుట తటస్థించినప్పుడుమాత్రమే యిట్టిది సంభవించును. మరియొక విషయము- ఆమె కురు లన్నియు నొక్కులు పడి సుందరముగా నుండును. ఫాలము విశాలము' అనెను.

సూపరింటెండెంటు వగైరా లాశ్చర్యచకితు లైరి. కమలాకరము వారిమనోభావములు తృటిలో గ్రహించి, 'ఏ మ ట్లాశ్చర్యపడెదరు? చూడుడు. ఈభాగము వెంట్రుకయొక్క మొదలు. ఇచటనుండి యీనొక్కు లెంతదూరమువర కుండిన ఫాలమంత విశాలముగనుండును' అనియెను. ఆతని భావాలోచన కందరు రచ్చెఱు వందిరి.

మరికొంతసే పాగదిని పరిశీలించెను. కాని యిక నెట్టిజాడయు మన కమలాకరమునకు గన్పట్టలేదు. అంతటితో నాపరిశోధన ముగించిరి. అప్పటికి సుమారు నాల్గుగంట లయ్యెను. వారందఱును కలసి విలాసముగ ముచ్చటించుకొనుచు గోదావరీతీరమునకు షికారుపోయిరి. అచ్చటి చల్లనిగాలి నాస్వాదించుచు చీకటిపడువర కటనుండి యెవరిగృహములు వారుచేరిరి.



(6)

# సన్యాసి మఠము-హరినాథ యోగి.



ఉదయమున నెప్పటియట్ల సూపరింటెండెంటు తన కాలకృత్యములు నిర్వర్తించుకొని యొకసారి కమలాకరముకు దర్శింపవలయునని వారియింటి కరిగెను. కాని యాతఁడింటలేడు. సేవకుని బ్రశ్నింప వారు రాత్రి పదిగంటలకే బయలుదేరి యెచ్చటికో పోయియుండిరనియు, నింతవరకు రాలేదనియు ప్రత్యుత్తర మొసంగెను. దొరగారు కమలాకరుని కార్యదీక్షకై చాలసంతసించుచు నింటికి పోయెను. కొంతసేపట కూర్చుండి యేమియుఁ దోచక గ్రామములోనికి పోయెను. గ్రామమున నెవ్వరి నోటనుండి విన్నను చోరుల యొక్కయు, హంతకులయొక్కయు చర్యలే, అవన్నియు వినుచు నాతఁడు మెల్లమెల్లగ నడచుచు పదిగంట లగుసరికి గోదావరీ తీరమును చేరెను. అప్పుడే బూరగుమ్మలపాడునుండి రేవుపడవ వచ్చి యొడ్డును చేరెను. అందుండి యొకసన్యాసి దిగెను. దొరగారా సన్యాసిని గాంచినంతనే యాతనిచే నాకర్షింపబడి యాతనివైపు తదేకక్షుణగా చూడదొడంగెను. ఆసన్యాసి చిరునవ్వుతో నాతని సమీపించి, 'బాబా! ఏమట్లు చూచెదవు? నీకు దేవుడు మంచిలాభము కలుగ చేస్తాడు, నాకు గంజాయి యిస్తావా?' యనెను.

సూపరింటెండెంటు ఆశ్చర్యమగ్నుడై, 'సాధుజీ! నావద్ద గంజాయి లేదు, ఈరూపాయి తీసికొని అంగడిలో తీసికొమ్మని రూపాయి నీయబోయెను.

సన్యా—వద్దు బాబా! నాకు ఒకఅణా పత్రిచాలు. రూపాయి యెందులకు?

నూప___పోనిమ్ము. నీదగ్గర నుంచుకొనినచో నవసరమైనప్పుడుపయోగింప గలదు.

సన్యాసి నవ్వుచు నీకు' కావలసినచో నేను రూపాయి యిస్తాను తీసికో' అని తనచంకనున్న చిన్నసంచిలోనుండి పదిరూపాయిలు తీసి దొరగారి కీయబోయెను. దొరగా రాతని దాతృత్వమున కచ్చెరు వందుచు నూరకుండెను. సన్యాసి 'పోనిమ్ము. నీకెందుకు నా ముష్టిసొమ్ము? ప్రభుత్వమువా రుచితముగా నీకు నెలకు నాల్గువందలు యిచ్చుచున్నారు. నాదారిని నే పోయెద' నని రూపాయలు సంచిలో వైచుకొని వడివడిగా నడచిపోసాగెను. దొరగా రాతని వెంబడించవలెనని యూహించెనుగాని సాధ్యము కాలేదు. ఆసన్యాసి శరవేగమున నాతని దృష్టిపథమునుండి తొలగిపోయెను. దొరగా రాతని కనుగొనవలెనని విశ్వప్రయత్నముచేసెను. ఆహారపానీయములు వదలి, ఎండ వేడిమికి లెక్కసేయక సుమారు మూడుగంటలవరకు యూ రంతయు కలయదిరిగెను. చిట్టచివరకు నాతఁ డొకమఠము సమీపించెను. అచ్చట నాతఁడు చూచిన సన్యాసి గంజాయి పీల్చుచు కూరుచుండెను. ఆతడు మాత్రము తనదృష్టి సాగినంతవరకు ప్రతివస్తువును పరిశీలనాదృష్టితో చూచుచున్నట్లు కన్పడుచుండెను. దొరగా రాతని చూచినంతన మొదటిసన్యాసికంటె యీతనివిషయ మెరుంగవలయునను యభిలాష యెక్కువయ్యెను. వెంటనే యీతఁడు యీనూతనసన్యాసి కులగోత్రనామము లెరుగవలె ననుయభిలాషతో నాతనినిసమీపించెను. దొరగారిరాక చూచి యీతఁడు నవ్వుచు, 'బాబూ! వచ్చితివా? నీ కొరకే యెదురు చూచుచున్నాను. రమ్ము. కూర్చుండుము. నాపేరు' హరినాథయోగి నాకొక యూరు లేదు. అన్నియు నాగ్రామములే యనెను.

సూపరింటెండెంటుదొర యాతని చాకచక్యమునకును, జ్యోతిష ప్రభావమునకును నాశ్చర్య మొంది యాతనిపక్క కూర్చుండి "స్వామీ! నా దొకప్రశ్న యున్న" దనెను.

హరి—తెలసినది నాయనా తెలసినది. నీ వొకవిషయములో ప్రయత్నము చేయుచుంటివి. అందులో కొంత కాలమునకు నీకుజయము కలుగును. ఆవిజయసూచకముగా నీ కున్నతపదవికూడ లభింపగలదు. బాబూ! నీ వింక యింటికి పొమ్ము. పాప ముదయమునుండియు భోజనము లేదు. సుఖముగ భుజించి నిద్ర పొమ్ము.

సూప—చిత్తము. మరల తమదర్శన మెప్పుడు?

హరి—ఏమో నాయనా! ఎట్లు చెప్పగలను? భగవంతుఁ డెప్పుడు పొసగించిన నప్పుడు.

ఇంక నాతనితో సంభాషించుట చాలప్రమాదకరమని తలంచి సూపరింటెండెంటు 'బాబూజీ! సెలవు' యని వెడలిపోయెను. పోవుచు నొక్కసారి మొదటిసన్యాసివైపు తీవ్రముగ చూచి వెడలిపోయెను. ఆతని తీవ్రదృష్టిమాత్ర మాసన్యాసి హృదయమున తీవ్రముగ నాటి పోయెను.

సాయంకాలమువరకు నామఠమున సన్యాసులు చాలమంది కూర్చుండి యుండిరి. సూర్యాస్తమయమయిన వెంటనే యెవరిదారిని వారు పోసాగిరి. మనపరిచితులగు సన్యాసులుకూడ చెరియొకదారిని పోయిరి. పాఠకులారా! ఆసన్యాసులెవరు? ఎందు పోవుదురు? వా రట్లు తిరుగు చుండుటకు కారణమేమి? వారిని వెంబడించి తెలిసికొనప్రయత్నింతము.

ఇరువురు చెరియొకదారిని పోవుటవలన నొకేసారి యిరువురను పరిశీలించుట కష్టము. కావున నందు మనము మొదటచూచిన సన్యాసిని వెంబడింతము. ఆతడు పోయిపోయి యాగ్రామమున కుత్తర దిక్కున నున్నయరణ్యములోనికి పోయెను. సుమారు గ్రామముదాటి

నాలుగైదు మైళ్ళుపోయినపిమ్మట గడ్డము, మీసము వగైరాలు తీసివైచెను. అతని ముఖమున దివ్యకళ తాండవ మాడుచుండెను. ఆహా! యట్టిరూపసి యిట్లు సన్యాసివేషము ధరింపవలసిన యగత్య మేమై యుండును? ఆత డెవ్వరు? అతనిని మనము ప్రస్తుతము పోల్చుకొనుట కూడ కష్టము. ఆతఁడు కడురయమున నాయరణ్యమునం బడిపోవుచుండెను. కొంతదూరము పోయి యదృశ్యు డయ్యెను. పాఠకులారా! వెనుకను పోవుదము. సన్యాసిమఠమున నలుగురైదుగురు సన్యాసులు నిద్రించుచుండిరి. ఒకడు మాత్రము కూర్చుండి యుండెను. కొంచెముసేపయినపిమ్మట నామఠమంతయు కలయదిరిగి యొకచోట నొకయుత్తరము చూచి వికసితవదనారవిందుడై యీవలకువచ్చెను. ఆసన్యాసి మనము చూచిన హరినాథయోగి. మఠముదాటి గోదావరియొడ్డునకు పోయి తనకృత్రిమవేషమును తీసివైచి యాయుదకంబున ముఖము కడుగుకొనెను. ఆశ్చర్యము—ఆతఁడెవ్వరు? మనకు పూర్వపరిచితుఁడు—కమలాకరము. కాన యాతఁడు చూచిన యుత్తరమేమి? దానింగాంచినంతనే యాత డంతప్రహర్షితవదనుడు కానేల? పాఠకులారా! తొందగ పడకుడు. నిదానముమీద నాలేఖలోని వృత్తాంత మంతయు తెలిసికొందము. అతఁడు తనమాయావేషదుస్తులు భద్రపఱచుకొని యింటికి పోయెను. మనముకూడ నేటికి నిద్రింతము.



# సర్వేశ్వరయోగి.



ఉదయముననేలేచి కమలాకరము జవానును సూపరింటెండెంటు దొరగారికొరకు పంపెను. తాను కాలకృత్యములం దీర్చుకొనునంతలో దొరగారుకూడ వారిపనులన్నియు నిర్వర్తించుకొని కములాకరుని దర్శించిరి. కములాకరము దొరగారి నొకకుర్చీపై నాసీనులంజేసి తానుకూడ నొకచో గూరుచుండెను. వా రిరువురిట్లు సంభాషింప మొదలిడిరి.

సూప—కమలాకరంగారూ! నిన్న మీజాడయే కన్పింపలేదు.

కమ—అదేమండీ యట్లనియెదరు? నిన్న నే నూరు కదలలేదు. మిమ్ములను గోదావరియొద్దనున్న సన్యాసిమఠములో రెండుసారులు చుచితిని.

సూప—అటులనా? నేనుమాత్రము మిమ్ములం జూడలేదు. కాని, యామఠమున నిరువురు సన్యాసులుమాత్రము కారణాంతరమున నట్టివేషములను ధరించియుండవలయునని యూహించితిని. కాని వా రెవ్వరోమాత్రము తెలిసికొనలేక పోయితిని.

కమ—అందు నీవు ముందు గాంచినయతండు సర్వేశ్వరరావు. అతండుకూడ తనచెల్లెలి నపహరించిన చోరుని పట్టుకొనుటకై ప్రయత్నించుచుండెనట.

సూప—మీ కెవరు చెప్పిరి?

కమ—అతనిలేఖయే చెప్పుచున్నది. (అని తాను మఠములో సంగ్రహించిన కాగితము చూచి చదువ నారంభించెను.)

'శ్రీ బ్రహ్మజ్ఞాన సంపన్నులగు హరినాథ యోగిగారికి—

సర్వేశ్వరయోగి వ్రాయున దేమనగా—

నేను కార్యాంతరమున నీదారిని పోవుచుంటిని. నా యీ ప్రయత్నమునఁ గొన్ని విశేషములు లభించవచ్చునని యూహించుచున్నాను. నేను తిరిగి వచ్చినతరువాత తమ రొకసారి మీస్వగృహంబున నాకు దర్శన మొసంగ ప్రార్థితులు'.

చూచితిరా! యీయుత్తరము. సర్వేశ్వరరావు తిరిగి వచ్చునపుడు మన కుపకరించు సాధనములఁ గొన్నిటిని తే వచ్చునని నమ్ముచున్నాను.

సూప—మీరే హరినాథయోగియని యాతఁడెట్లు గ్రహించెను!

కమ—అదియే గూఢచారున కుండవలసిన ముఖ్యలక్షణము. మీరు నాతో నరగంట సంభాషించితిరి. కాని, నన్ను గుర్తింప లేకపోయితిరి. అతఁడు నెల్లిపాక చేరిన మరునాడే యూరు విడచి యెచ్చటికో పోయినట్లును, యింతవర కతని బంధుజాలమున కెవ్వరికిని యతనిజాడ తెలియదనియు తలంచెదను.

సూప—ఎట్లు చెప్పఁగలరు?

కమ—అతడు ధరించిన జీర్ణవస్త్రములఁ బట్టి యట్లూహింపవలసి వచ్చుచున్నది.

సూప—సన్యాసులకు జీర్ణవసనములు కాక క్రొత్తవి యెట్లు వచ్చును?

కమలాకరము చిరునవ్వు నవ్వెను. 'దొరగారూ! మీకు పది రూపాయ లొసంగ సాహసించిన యాసన్యాసి నిర్ధనుఁ డనెదరేల?' యనెను.

సూపరింటెండెం టాశ్చర్య మొంది 'అయ్యా! మీప్రతిభ యమానుషము. ఇంటనుండియే భగవంతునివలె యూరఁగల్గు పను లన్నియు తెలిసికొనగలరు' అనెను.

కమ——దాని కేమి లెండు. మీరు నాకొక యుపకారము చేయవలసి యున్నది. ఈదినమున నేను వేరొకపనిపై నొకచోటకు పోవలసియున్నది. నావెంట నాసేవకుని గొనిపోయెదను. ఇంటివద్ద మాత్రము సమర్థులగు యిరువురు రక్షకభటులఁ గావలి యుంచవలెను వా రెంతమాత్ర మజాగ్రత్తగ నున్నను ప్రమాదము తటస్థించును.

సూప——అటులే యేర్పాటు చేసెదను.

కమ——ఇంకొకటి. ఈమధ్యాహ్నమునకుగాని, సాయంకాలమునకు గాని, దామోదరశాస్త్రిగారు వత్తురని దోచుచున్నది. వారు వచ్చినచో వారితో మీరేమియు చెప్పక నేవచ్చువర కతని నాపు చేయుఁడు. అతనివలన కొంతగ్రంథము రా బట్టవలసియున్నది.

సూప——చిత్తము. మీరు తిరిగి రాత్రి వచ్చెదిరా?

కమ——వచ్చెదను కాని, మరల యుదయమే మీకు కనుపించెదను. ఉదయమున మీతో నా దామోదరశాస్త్రిగారిని కూడ తోడ్కొనిరండు. అని చెప్పి సేవకునితో కలసి గృహము వీడి మెటపాకరోడ్డున నడచిపో సాగెను. కమలాకరము వెడలిపోయిన వెంటనే. సూపరింటెండెంటు దొరగారు నలువురు సమర్థులైన నమ్మకముగల రక్షకభటుల నాయింటికి కా వుంచి, భద్రమని హెచ్చరించి ఇంటికి వెడలిపోయెను. కాని, యాతని దృష్టిమాత్ర మాగృహము మీదనే యున్నది. అరగంట కొకసారి వచ్చి యాయింటి నాలుగు మూలలను పరికించి, రక్షకభటులను హెచ్చరించి పోవుచుండెను.



# కపటవ్యూహము.



మధ్యాహ్నము రెండుగంటల లయ్యెను. కమలాకరము చెప్పి నట్లు దామోదరశాస్త్రి వచ్చి యాతని యింటివద్ద నున్న రక్షకభటు లతో 'బాబూ! డిటెక్టివుదొరగా రున్నారా?' యని ప్రశ్నించెను. అందొక భటుడు యాతని బాగుగ పరిశీలించి, "మీపేరు దామోదర శాస్త్రిగారా?" యనెను. దామోదరశాస్త్రి యాశ్చర్యమగ్న డయ్యెను కాని యాతని ముఖమునం గల్గిన యీ యాకస్మికలక్షణ మాపోలీసులు కనిపెట్ట జాలకపోయిరి.

రక్ష—మీరు వచ్చినచో సూపరింటెండెంటు దొరగారు ర మ్మనిరి. డిటెక్టివుగారి విషయమై మీకుఁ గావలసిన దంతయు వారు తెలుపగలరు.

దామో—వారి యి ల్లెక్కడ బాబూ?

రక్ష—అదిగో యీ కనబడుచున్న పచ్చమేడ అని యొక మేడ చూపెను. దామోదరశాస్త్రి మారాడక యామేడను సమీపిం చెను. మేడమీదనుండి చూచుచున్న దొరగారు క్రిందకు వచ్చి సగౌర వముగ నా దామోదరశాస్త్రిగారిని లోనికిఁ గొనిపోయి యొకకుర్చీపై నాసీనునిం జేసెను. వారు నిశ్శబ్దముగ నొక యరగంట కూర్చుండిరి. మార్గాయాసము తగ్గిన తరువాత దామోదరశాస్త్రి "దొరగారూ! మన ప్రయత్నము లెంతవరకు వచ్చినవి" యని ప్రశ్నించెను.

దొర—ఏమో నండి. నాకు తెలియదు. ఆభార మంతయు డిటెక్టివ్దొరగారిదే. వారి కేమైన సహాయ మొనర్చుటయే నాకు విధి. అంతకంటె నేమియు తెలియదు.

దామో—వా రెప్పుడు వత్తురు? నా యీరాక వృథాయగునా?

దొర—లేదు - లేదు. మీరు వచ్చెదరని యాతడు చెప్పియే పోయెను. వచ్చినచో వారు వచ్చువర కుంచుమనికూడ చెప్పిరి.

దామోదరుని మరియొకమహా రాశ్చర్యపిశాచ మావహించెను. కాని యీసారిమాత్ర మాతనిముఖమునందలి మార్పు దొరగారిదృష్టి నుండి గుప్తపరుప జాలకపోయెను ఆతఁడు లేచి "బాబూ! నేను భోజనము చేసి వచ్చెదను." యని లేచెను. సూపరింటెండెంటుగారు 'వలదు. మీరిచ్చటనే భుజింపవచ్చును. దొడ్డిలో యుష్ణోదకమున్నది. స్నానము చేసి మీయనుష్ఠానములు నిర్వర్తించుకొనుడు. వంటకూడ పూర్తి కావచ్చెను' అని యాతని బలవంత పెట్టెను. దామోదరశాస్త్రికూడ మారు పలుకజాలక స్నానమునకై పెరటిలోనికి పోయెను. మరి కొంతసేపటికి సూపరింటెండెంటుగారుకూడ స్నానముచేసి శాస్త్రిగారి జపము పూర్తికాగానే యిరువురు భోజనముచేయుట కారంభించిరి. కొంచె మాకలి యుపశమించినతరువాత వా రిరువు రిట్లు సంభాషింప మొదలిడిరి.

దామో—ఏమండీ? డిప్యూటీ వుగారిని దర్శించి వెంటనే వెళ్ళిపోవలయునని వచ్చితిని. కాని నాకోర్కె తీరినదికాదు. వారు బహుశః మాప్రయత్నముమీదనే వెళ్ళియుందురని తలచెదను.

సూప—తెలియదండి. వారు వెళ్ళునప్పుడు మాత్రము మీరు వచ్చినచో నాపుచేయుమని చెప్పిరి.

దామో—నేను వచ్చెదనని వారి కెట్లు తెలియును?

సూప—అదికూడ పూర్తిగ నే నెరుఁగను.

దామో—బాబూ! భగవంతుఁడు మా కింకను యెట్టియిక్కట్టులు కలుగఁ జేయనెంచెనో చెప్పజాలను. నెలదినములనుండి మా కన్నియు కష్టములే సంభవించుచున్నవి.

నూప — మరల నేమిజరిగినది?

దామో — మేమిచ్చటనుండి మాయూరు చేరినమరునాడే మాయల్లు డెక్కడకో పోయెను. మానమీపగ్రామములలో మాబంధువులు, యాతనిస్నేహితులుకూడ నుండిరి. అందుచే వారియిండ్లకుపోయియుండుననియు నాతఁడే వచ్చుననియు తలంచి యూరకుంటిమి. కాని వా రెవ్వరు నాతనిఁ జూడలేదని ప్రత్యుత్తరము లొసంగిరి. దానితో మా కాందోళన మెక్కువయ్యెను. వెంటనే బయలుదేరి యిక్కడకు వచ్చితిని. ఆతఁడు డిటెక్టివుగారితో ముచ్చటించుట కిచటకు వచ్చియుండునని గంపెడాశతో వచ్చితిని. ఇక్కడకూడ కాన్పింపలేదు. ఎట్టి ముహూర్తమున నూననరమును డి బయలుదేరితిమో కాని మాదురదృష్ట వశమున దారిలో ధనహాని సంభవించెను. ద్రవ్యముపోయినను ప్రాణములు దక్కినవికదాయని సంతసించితిమి. కష్టములొంటిగ రావను నార్యోక్తి ననుసరించి యిచ్చట పాపము లక్ష్మీకాంత మ్మ యపహరింపబడెను. ఆమె నెట్లులైన వెదకి మాకానందము గూర్చెదరని యూరట చెందియుండ నింతలో మానర్వేశు మాయమయ్యెను. ఇతఁడుకూడ నానరహంతకులవలలో దగుల్కొనియుండునని నిశ్చయింపవలసివచ్చుచున్నది. బాబుగారూ! ఇక నెవ్వరిని చూచుకొని జీవితును? ఉన్న దొక్క కూతురు, మహావైభవముతో పెళ్ళిచేసి సంతసమందుచున్న నాయానందమును చూచి సహింపలేక యాభగవానుఁడు మా కిక్కట్టుల కలిగించుచున్నాడు. అయ్యో! వారిపిల్లల నిద్దర శత్రువుల పరముచేసి నే నేమొగముపెట్టుకొని మాబావగారిని చూడగలను? బాబూ! ఇంకనాకు మరణమే శరణ్యము. డిటెక్టివుదొరగారితో నీ విషయములన్నియు దెలిపి వారేమైన యుపాయము చూపిన నింటికి మరలుదమనియు, లేకున్న నిక్కడనుండియే యేనిర్జనారణ్యమునకైన బోయి జీవితశేషమును గడుపదలంచుకొని యిటకు వచ్చియుంటిని.

కాని,యిదియు నాదురదృష్టమే యనుకొనెదను- వారిదర్శనముకాలేదు. అని కంట తడిపెట్టు కొనసాగెను. దొరగారాతని దీనావస్థకు చాల జాలినొంది 'శాస్త్రిగారూ! విచారింపకుఁడు, పడినగోడలు పడినట్లుం డవు, కష్టము లెల్లకాలము కాపురముసేయునా? నేడుఁగాకున్న రేప యిన నాహంతకులు దొరకకమానరు, మీవారి కేవిధమైన హానియు కలుగదు. ధైర్యమవలంబింపుఁడు, కంటఁ దడిపెట్టుట ధీరపురుషలక్ష ణము కా'దని యాతనికి ధైర్యముగొలిపెను. ఎట్టకేలకు వారు భోజ నము ముగించి లేచి చావడిలో ప్రవేశించిరి. నూపరింటెండెంటు చుట్ట కు నిప్పంటించి 'శాస్త్రిగారూ! కొంచెమునే పాకుర్చీలో విశ్రమించు డు. భోజనానంతరము నాకు నిద్రయావశ్యకము, ఒక్క కునుకుతీసి వచ్చెద'నని చెప్పి వీధియరుగుపై నున్న రక్షకభటులతో రహస్యముగ దామోదరశాస్త్రివిషయమున భద్రమని హెచ్చరించి లోనికిపోయి నిద్రించెను-

సాయంకాలము మూడుగంటలకు లేచి నూపరింటెండెంటు కాఫీ పుచ్చుకొని శాస్త్రిగారివద్దకు వచ్చెను. శాస్త్రి లేడు. ఎచ్చటకు పోయె నని రక్షకభటులను ప్రశ్నింప నిప్పుడే గోదావరి రేవునకు పోయి వచ్చెదనని చెప్పి చెంబు తీసికొనిపోయెనని నుడివిరి. ఆతడేవచ్చు నని దొరగా రేదో పుస్తకము చూచుకొనుచు కూర్చుండిరి. గోడకు వ్రేలాడుచున్న గడియారము మైదుగంటలు కొట్టెను. శాస్త్రి రాలేదు. ఆతనిని వెదకుటకై భటుల నలువైపుల కంపెను. వారు శాస్త్రి నెందునుం గానక తిరిగి వచ్చిరి. దొరగారు తత్తర మొందుచు నాతఁడు కూర్చుండిన కుర్చీవైపు వెఱ్ఱివానివలె చూచుచుండెను. హటాత్తుగ నాతఁడు లేచి యాకుర్చీని సమీపించెను. అం దొకయుత్తర మున్నది. తత్తరముతో దానిని తీసి చదువసాగెను. అం దిట్లున్నది.

"దొరగారూ! మీ రింత యమాయకులై సంచరింతురని నే

నూహింప లేదు. ప్రతివానిని నమ్ముటవలన జాలప్రమాదము సంభవించును. ఇంతటినుండియైన జాగరూకుఁడవై యుండుమని హెచ్చరించుచున్నాను.

"M. R."

ఆయుత్తరము చూచి యాతడు తెల్లబోయెను. మరునాఁడుదయము కమలాకరముతో నీవిషయ మంతయు నివేదించెను. అంత కమలాకరము విచారముతో "పిట్ట యెరిగిపోయిన" దనెను. పునఃప్రయత్న మొనరింప నిశ్చయించుకొని నాటి కూరకుండిరి.



# బెదరింపు-మల్లయుద్ధము.



పాఠకులారా! మన మొకసారి లక్ష్మీకాంతమ్మను జూచి వత్తము. ఆమె ముఖమున నిసుమంతయు సంతోషము కన్పించుటలేదు. నాల్గు గోడలమధ్య నామె బంధింపబడియుండెను. ఆగదికూడ చూచుట కసహ్యముగ నున్నది. సూర్యరశ్మి లోపలకు వచ్చుట కవకాశము లేదు. మట్టిగోడలు. అవియైనను నున్నగ లేవు. ఆగోడలయందు బిళ్ళ పెంకులువగైరా కఠినపదార్థములు మేకులు నాటుకొని యున్నట్లు పైకుబికియుండెను. నేల యంతయు తేమగ నుండెను. అనుగువైచిన సాశీతలము శిరమున కెక్కుచున్నది. దోమలసంఖ్య లెక్కింప తరము గాదు. పాప మాతరుణి యట్టి హేయకరమగు స్థలమున బంధింపబడి నేటికి పదునైదుదినము లయ్యెను. ఈమూనార్థము సందామె యొక్క మారుమాత్రమే మానవదర్శనమునకు నోచికొని యుండెను-అప్పుడయి నను నామెకు మానవదర్శన భాగ్యమే కాని, ప్రేమపూరితవచన శ్రవణ లాభ మబ్బినది కాదు- మధురవాక్యములకు బదులు కఠోరవిషాద బీభత్సజనితములగు పిడుగులం బోలిన పదంబులు యామెకర్ణరంధ్రంబుల బ్రతిధ్వనించెను- శబ్దజ్ఞానముచేత నాతడు కఠినహృదయుడనియు పాషండుడనియు గ్రహించెను. వాక్శ్రవణమాత్రమున భీతచిత్తయైన యాభీతహరిణేక్షణ యామానవుని రూపవైభవము దిలకింప నించుకంతయు యోచించియుండలేదు- నిజమున కట్టియూహయే యామె కాసమయమునఁ గల్గినచో నీభయంకరకారాగృహనివాసము, యాతని భీకరకర్ణకఠోరనిస్వనము, వీనికితోడు యాతని భీకరరూపముకూడ జతపడి యామెహృదయమును భేదింపక మానదు-ఆ కురంగలోచన తనకు

సంభవించిన దురంతచింతాకలితవిషమ పరిస్థితిని గూర్చియు, తద్విమోచనోపాయమును గురించియు యోచింప సాగెను.

కాని, యామె యాలోచనము మరల నాకర్ణకఠోరధ్వనివలన భంగపరుపబడెను. ఆభీషణాకారుడగు పురుషుడు మరల నేతెంచి "కాంతం! ఆలోచించుకొంటివా?" యనెను.

లక్ష్మి — స్థిరనిశ్చయనై యుంటిని.

పురు — ఏమి చేయుటకు!

లక్ష్మి — దుష్టశిక్షణ శిష్టరక్షణ సమర్థుడగు భగవానుని ధ్యానించుచు నిందే నాజీవితశేషము గడపుటకు.

పురు — తరుణీ! నా మాట వినుము. నీ సుకుమారదేహము శుష్కింప జేసికొనకుము. నీ నవయౌవనమును యడవిగాచిన వెన్నెలవలె నిరర్థక మొనర్చుట పాడిగాదు. అట్లొనర్చిన భగవానుని యభిప్రాయమునకు వ్యతిరేకముగ నడచిన దాన వగుదువు. దాన నాతని యనుగ్రహదృష్టికి దూరస్థురాలవై యిక్కట్టుల పాలగుదువు. నామాట లాలించి నీ యభిమతమును మార్చుకొనుము.

లక్ష్మి — నీ హితోపదేశములతో నా కవసరము లేదు. పతివ్రతాలక్షణములకు విరుద్ధముగ ప్రవర్తించుటకూడ నాపరాత్పరుని కపచారము గావించుటయే; కావున నాయంతరాత్మ యాపని కెన్న డంగీకరింపదు.

పురు — లలనా! చెడిపోయెదవు. పదునైదుదినములనుండి నిద్రాహారపానీయములు లేక యీ బందియందు పడి దుర్భరవెతల ననుభవించుటవలన నీ కోమలశరీర మెట్లు మారిపోయి, సంపూర్ణకళావిభాసమగు చంద్రబింబమును ధిక్కరించు నీవదనపద్మ మెంత వాడియున్నదో చూడుము. పాషండహృదయుడ ననుకొనుచుంటివిగాని, నిజముగ నీదీన స్థితి చూచిన నాకు చాల జాలి కలుగుచున్నది.

లక్ష్మి—అట్టి దయాదాక్షిణ్యములే నీకుండినచో నింతటి ఘోర కార్యమున కొడిగట్టవు. ఎప్పటికైనను మనోదీక్ష గలిగి ధర్మమార్గావలంబకులగు వారు తప్పక జయము గాంతురు. ఇందుల కాపరాత్పరుని కృత్యములే సాక్షి.

పురు—ఇప్పుడు నిన్నేమి చేసినను నను నడ్డగించువారు లేరు. ఈపరిసరముల నాయాజ్ఞకు వ్యతిరిక్తముగ ప్రవర్తించువారు లేరు. ఒకవేళ ప్రభుత్వమువారు నినుః రక్షింతురని తలంచుచుంటి వేమో! అది వట్టి యడియాస. ఈప్రదేశమునఁ బ్రవేశించుటకా త్రినేత్రునకైన సాధ్యము కానేరదు. పోలీసుద్యోగుల విషయమెఱింగించెద చూడుము సబినస్పెక్టరు రంగనాథం నిన్నరాత్రి నాయనుచరులచే నిందే వేరొక మూల బంధింపబడెను. రెండు మూడు రోజులలో నూపంఁబొండెంటు దొరగాఁకకూడ మాయుచున్నాఁ దగులోకానును. ఇంక నెక్కడ నుండియో వచ్చిన కమలాకర మీప్రాంతములకు పూర్తిగ క్రొత్తవాఁడు. ఆతఁడీప్రదేశము భద్రాద్రికే మూలనున్నదో కూడ నెఱుంగఁడు. నిను రక్షించువా రిక నెవ్వ రున్నారు? నీ వీజన్మమున నా కోర్కె దీర్చినంగాని పురప్రవేశము గావించుట కాని, పురుషసందర్శనము గావించుట కాని జరుగదు.

లక్ష్మి—నాకు పురములు, పురుషులతో నిమిత్తము లేదు. భగవధ్ధ్యానమునకు పురము లెందులకు? నిశ్చింతతో నిర్మలమనస్కనై యిందుండియే యాసర్వేశ్వరు నారాధించెద. ఎప్పటికైన నాతనికే కరుణ కలుగ గలదు.

ఈప్రత్యుత్తరము వినినంతనే యాపురుషుఁ డతిక్రోధపూరితుఁ డయ్యెను. మొలలో గుప్తముగ దాచియుంచిన బాకుతీసి 'మూర్ఖురాలా! నే నెంత చెప్పినను వినకుంటివి. నిన్నిప్పుడే యమసదనమునకు బంపెద. నీయిష్టదైవమును ప్రార్థించుకొనుము'. అనిపలికి యామె వక్షముపై పొడువబోయెను. ఒక్కనిముసములో నాతనిబాకామెవక్ష

మున నాటబడి యామెజీవితమును కడతేర్పనున్నది. ఇక నొకరెప్ప పాటుకాలములో పాప మానవకుసుమకోమలదేహ మారక్కసుని నిశితకరవాలధారల కాహుతిగానున్నది. సర్వాత్మకుండు దయారహితుం డగునా? నేటితో లక్ష్మీకాంత మీ మాయాప్రపంచకమునుండి మాయము కావలసినదేనా!

ఆశ్చర్యము. ఇంతలో వెనుకనుండి యెవ్వరో తుపాకి ప్రేల్చిరి. ఆదెబ్బ కామాంధ్యునిచేతియందున్న బాకు క్రిందపడిపోయెను. వెంటనే యాతడు తోకత్రొక్కినత్రాచువలె కస్సుమనుచు వెనుదిరిగెను. అచట నెవరుగలరు? తనయనుచరులచే గతరాత్రి బంధింపంబడిన రంగనాథమూర్తి. ఆతనిం గాంచినంత నాపురుషుడు భీతహరిణంబుపై కురుకు కొదమసింగముభాతి నాతనిపై కురికెను. కాని యాతండు తలంచినట్లారంగనాథము భీతహరిణంబుగాక విజృంభించి యాచోరాగ్రేసరునితో కలియబడెను. ఇరువురకును మల్లయుద్ధ మతిఘోరముగ జరుగుచుండెను. రంగనాథమూర్తి యాతని గ్రిందవడవైచి గుండెపై కూర్చుండి కుడిచేత పిస్తోలుతీసి 'దుర్మార్గుండా! నేటితో నీదురాగతము లంతము కాగల'వని యాతని కంఠమునకు గురిచూచెను. తుపాకి ప్రేలినచో నా నరహంతకు డంతకునిసన్నిధి చేరును, కాని భగవాను డట్లానర్పలేదు. పాపీ చిరాయు వనునట్లాతని యాయువును పొడిగింప దలచెను. భగవానునిచర్య లతిచిత్రములుకాదా!

ఆచోరనాయకుండు క్రిందపడిన వెంటనే పెద్దకేకవైచెను ఆకేక విని వాని యనుచరు లెల్లరు పరుగుపరుగున వచ్చి తుపాకి పేల్చుటకు సిద్ధముగనున్న రంగనాథమూర్తిని,మరల పట్టుకొనిబంధించిరి. రంగనాథునిమొదటికాల్పునకుగాయముపడియున్నయాచోరనాయకునికుడిహస్తమునకుకట్టుకట్టి,లక్ష్మీకాంతమున్నగదిబంధించి, యాతనినిదోడ్కొనిపోయిరి. తానొకటితలచినదైవమొకటితలచుటయథార్థముకదా?



# చుట్టల దుకాణము.



మఱునాఁడుదయమున పదిగంటలగునరికి రంగనాథమూర్తి శత్రువులచేత చిక్కినను వార్త భద్రాచలమునం దా బాలగోపాలమునకు తెలిసిపోయినది. కమలాకరముకూడ నీ వార్త విని సూపరింటెండెంటు దొరగారికి వర్తమాన మంపెను. కాని, యాతఁడు జ్వరపీడితుఁడై రాఁజాలకపోవుటచేత కమలాకరము తానే స్వయముగా దొరగారి యింటికి పోయి యిట్లు సంభాషింప మొదలిడెను.

కమ—దొరగారూ! మనరంగనాథమూర్తి చోరులకు చిక్కెనట. మన కిపుడు కర్తవ్య మేమి?

దొర—మీ కెట్లు తెలిసినది?

కమ—దుమ్ముగూడెమునుండి కాన్స్టేబిలు వచ్చెను.

ఇంతలో నాజవానుకూడ వచ్చి దొరగారికి సలామొనర్చి యచ్చట జరిగిన కథయంతయు నిట్లు చెప్పఁదొడంగెను.

“అయ్యా! మొన్నటిమధ్యాహ్నము రెండుగంటలకు దుమ్ముగూడెము చేరితిమి. నాల్గుగంట లగునరికి యక్కడి యాయుధముల తణిఖీ పూర్తి యయ్యెను. అనంతరము మెవాబసలకు వారు పోయితిమి. సాయంకాల మూఁడుగంటలకు ఇన్స్పెక్టరుగారు చల్లగాలికై గోదావరీ తీరమునకు బోయిరి. మరల తిరిగి రాలేదు. ఉదయమునమాత్రము మే మందరమును పోయి యాప్రదేశమంతయు వెదకితిమి. అక్కడొక చోట వారిచేతికఱ్ఱయు, దానిప్రక్కనే సగముకాలిన చుట్టయు దొరకినవి. వానిని దీసికొని మిగతజవానులను సామానులతో వెనుక

రమ్మని చెప్పి, నేను ముందు సైకిలుపై వచ్చితిని." అని చెప్పి యా చుట్టయు. కరగ్రియు, దొరగారియుం దుంచెను. కమలాకరము చుట్ట తీసి పరిశీలించెను. అది మత్తుమందు కలసినదానివలె కాన్పించెను. వెంటనే యాతం డాచుట్టను తీసికొని సర్జనుగారివద్దకు పోయెను. వారుకూడ దానిని పరిశీలించి యాపొగాకుపై మత్తుమందు చల్లబడె ననియే తెలిపిరి. కమలాకరము. సూపరింటెండెంటుదొరగారికి యీ విషయము లన్నియు తెలిపి యాజవానును వెంటబెట్టుకొని సైకిల్సు మీద దుమ్ముగూడెము దారిపట్టిరి. సగముదారిలో వచ్చుచున్న జవానుల గలసికొనిరి. కమలాకరము రక్షకభటుల నందర జూచి "నిన్నను రంగనాథమూర్తిగారికి చుట్ట లెవ్వరు తెచ్చి" రని యడిగెను. నెం ౪౬౨ రు జవాను ముందుకువచ్చెను. "ఈసైకిలుపై నీవు నాతో రమ్ము. చుట్టలుతెచ్చిన దుకాణము చూపవలె" నని,మిగతవారిని భద్రాచలము పొమ్మని యాజ్ఞాపించి,నెం ౪62 రు జవానుతోదుమ్ము గూడెము చేరెను.వా రిరువురును కలసి యొకదుకాణమువద్దకు బోయిరి. దానిపై నొక నల్లని, ముప్పదియైదువత్సరముల యువకుడు కూరుచుం డెను. జవాను వానిని చూచి "ఏమండీ! నిన్నమధ్యాహ్నము నా కిచ్చినచుట్టలవంటివి మరొక అణావి యిప్పింపు" దని అణాకాసు నిచ్చెను. అతడు "బాబూ! ఆమూడుచుట్టలు ఒకపెద్దమనిషి శాంపి లుగా నా కిచ్చి మీాన్ఇన్స్పెక్టరుగారి కిమ్మని యిచ్చి పోయెను. ఇంక నావద్ద నారకవు చుట్టలు లే"వనెను.

కమ—ఆచుట్టల నెవ్వరిచ్చిరి?

దుకా—ఆయనను నే నెరుగను. కాని, రెండు మూడుమా రులు మాత్రము చూచితిని. ఆయన పేరు మాత్రమెరుగను.

కమ—చూచిన నానవాలు పట్టగలవా?

దుకా—ఔఁ! చెప్పగలను.

కమ—నిన్నీయభియోగములో సాక్షిగా వ్రాయుచున్నాము. ఈకాగితముపై సంతకముచేయుము. కోర్టువారు పిలచినపుడు వచ్చి నీయెదుట నిలుపబడినవారిలో నాపురుషుని గుర్తుపట్టి తెలుప వలయును.

దుకాణదారుఁడు చిత్తమని సంతకముచేసెను. కమలాకరము జవానుతో తిరిగి సాయంకాలమునకు భద్రాచలము చేరెను.



# మారువాడీ.



లక్ష్మీకాంతముమాట యెట్లున్నను ముందుగ రంగనాథమూర్తిని విడుదలచేయు టవసరము. కాని, అది యెట్లు సాధ్యపడును? ఇంతవరకును శత్రువులయునికి యిసుమంతయు పోలీసుశాఖకు తెలియదు. అట్టిచో నాతని బంధవిముక్తుని జేయుటయెట్లు?

భద్రాచలమున కుత్తరవైపున నొకదివ్యమందిరము కలదు. పైనుండి చూచు ప్రతిమానవునకును యాభవన మానందకరమై చూపట్టుచుండెను. ఆభవనముచుట్టును యెత్తయిన ప్రాకారము కలదు. తూర్పువైపున పెద్దద్వారమున్నది. అది యినపతలుపులచే బంధింపబడియుండెను. ఆద్వారమువెంట రెండుమోటారుకారు లొకేపర్యాయము లోనికి పోవుటకుఁ దగిన యవకాశ ముందునంత విశాలమైయుండెను. ద్వారముగుండా లోనికి బోయినచో నాద్వారమునుండి భవనద్వారము వరకుఁ బోవుచున్న యాబాట కిరువైపుల వివిధకుసుమభరితంబులై యున్న పూలమొక్కలు యాస్థలమున కంతకును వింతశోభ నొసంగుచుండెను. అందు, పాశ్చాత్యదేశములనుండి కొనితేబడిన రకరకముల క్రోటన్సులు కూడఁ గలవు. వేయేల? ఆభవనారామము దేవేంద్రుని నందనోద్యానవనమువలె నున్నది.

ఆభవన మెవ్వరిది? తెలిసికొందము. భవనద్వారముపై "సుదర్శనలాలు" అని చెక్కబడిన లోహపురేకు గలదు. దానిని బట్టి యాభవనము మారువాడీల దని యూహింపవచ్చును. లోనికి బోవుదము. మందిరము లోపలి భాగమంతయు గోడలు సగమువరకును పాలగచ్చు చేయఁబడియుండెను. కుడ్యములపై నాంధ్రి, మహారాష్ట్రి, మహమ

దీయ ప్రభువులయొక్కయు, నాయకులయొక్కయు, చిత్రపటములు వరుసగ నమర్పఁబడి యుండెను.

హాలునం దొకవైపున మెత్తనిపరుపులు దిండ్లు నమర్పఁబడెను. దానిపై నొకపురుషుఁ డాసీనుఁడై హుక్కా పీల్చుకొనుచుండెను. ఆతనివేషమును బట్టియే మారువాడీ యని చెప్పవచ్చును. కాని ముఖకాంతి మాత్ర మాతని కులలక్షణములకు వ్యతిరేకముగనుండెను. వయసు సుమా రిరువది వత్సరము లుండును. సుందరపురుషులలో నొకఁ డని చెప్పవచ్చును. అతఁడు కొంచెముసేపు హుక్కాను పీల్చి గొట్టమును కొంచెము దూరముగ నుంచి గతదినమున వ్రాయబడిన చిట్టా, ఆవర్జాలను సరిచూచుకొనుచుండెను. స్వల్పములగు తప్పులను సవరించుకొను నాకార్యమున దీక్ష కలిగియున్న యాతని కార్యమున కంతరాయము కలిగెను. ఒకమహమ్మదీయుఁ డరుదెంచి యతనికి సలామొనర్చి యచట నాసీనుడయ్యెను. మారువాడీ యాతని ముఖలక్షణముల నన్నియు బాగుగ పరిశీలించి "మీకిచట నేమి పనియుండి వచ్చితిరి?" యనెను.

మహ—నావద్ద నొకబంగారువస్తువు కలదు. దానిని విక్రయించుటకై వచ్చియుంటిని.

మారు— ఆవస్తు వేమి? దాని నేల యమ్మెదరు?

మహ—కంటె. ఇప్పుడు బంగారపుధర హెచ్చుగా నుండెను. కావున నియ్యది విక్రయించి భూమి కొనవలెనని సంకల్పించు కొంటిని.

మారు— మంచిపని చేయుచున్నారు. ఆవస్తువు చూపఁగలరా?

మహ—చూప కేమి! ఇదిగో నగ. అని కంటెను చూపెను.

మారువాడీ దానిని బాగుగ పరిశీలించి, "అయ్యా! బంగారు

మంత్ర శ్రేష్ఠమైనది కాదు. గీటునకు వచ్చునని తోఁచ" దని పలుకుచు గీటురాయి తీసి యానగతో దానిపై గీటు పెట్టెను.

మారు—ఒక్కవన్నె తగ్గినది. కాసుధరకు మూడురూపాయలు తక్కువలో తీసికొందును. ఇరువదిచిల్లర చేసికొనుడు.

మహమ్మదీయు డించుక యాలోచించి "సరే! దీనిని తూచు" డనెను. మారువాడీ దానిని తూచెను. పదికాసులకు అణాయెత్తు తక్కువ యున్నదని చెప్పి, సొమ్ము తీసికొని వచ్చుటకై లోనికి పోయెను. ద్రవ్యముతో తిరిగివచ్చి, యావచ్చిన మహమ్మదీయుని యూరు, పేరు, కులము, తండ్రిపేరు, వయసు, మున్నగున వన్నియు తనపుస్తకమున వ్రాసికొని, ఆత డమ్మినవస్తువుయొక్క వివరములుకూడ దానిలో నెక్కించెను. తరువాత నామహమ్మదీయుని చేవ్రాలు, పదివ్రేళ్ళయొక్కయు ముద్రలు తీసికొనెను. ద్రవ్య మొసంగి యాతనిని బంపివైచెను. కంటె నొకబల్లపై నుంచి యాలోచింపఁ దొడగెను. "అయ్యో! సాక్ష్యము లేకుండ నీనగ తీసికొంటిని. ఇది దొంగవస్తువేమో? పేరు లేదు కదా! అంతవఱకు వచ్చిన చూచుకొనవచ్చు" నని స్థిరపరచుకొని మరల చిట్టాలు సరిచూడ నారంభించెను. ఇంతలో గోడపై నున్న గడియారము పదునొకండుగంటలు కొట్టెను. యువకుఁడు పుస్తకముల మూసివైచి కంటె తీసికొని లోనికి పోయెను.

---

# మోసము.



సాయంకాలము సూర్యాస్తమయమున కెంతయో వ్యవధిలేదు. అట్టిసమయమున నొకపురుషుడు సామాన్యవస్త్రులను ధరించి భద్రాచలమున కనతిదూరముననున్న నొక కోయపల్లె ప్రవేశించెను. ఆతని వెనుక వేరొకకూలివాడు కావడిలో జల్తారుగిన్నెలు వైచుకొని వచ్చుచుండెను. ఆకూలివా డాపల్లెలో ప్రవేశించినంతనే "జల్తారుగిన్నె,లని కేక వేసెను. ఆకేక విని యాయూరినున్న కోయ లాబాలగోపాలము బయటకు వచ్చిరి. ఆపురుషు లిరువురు నొకచెట్టుసీడ నాగిరి. కావడి మోయుచున్న కూలివాడు కావడి దింపి, పెట్టెలమూతలు తెరచి,లోపలనున్న గిన్నెల నొక్కటొక్కటిగ పైకితీసి,తుడిచి, అందు కొన్ని యెల్లరకును కనబడునట్లు పెట్టెలమూతలలో పేర్చెను. ఆవస్తువులను చూచి యాశ్చర్య మందుచు నందరును చుట్టు చేరిరి. అం దొకస్త్రీ మెడలో బంగారుకంటె యుండెను. సామాన్యవేషధారి యగు నాయువకుం డామెను చూచి,"ఆహా! ఇది చాలవింతగ నున్నది. ఈమెలనాగ యేమి! కోయజాతిలో పుట్టుటేమి? ఈమె యుదంత మెరుంగవలయునని తలంచి, వింతవింత నగిషీలతో సుందరమైయున్న యొకగిన్నె చేతబట్టుకొని యాస్త్రీతో "అక్కా! ఈగిన్నె చాల మంచిది. గట్టిగ నుంటుంది. నాలుగేళ్ళపాటు ఇందులో సుఖముగ బువ్వ తినవచ్చు, తీసుకుంటావా" యనెను. ఆయువతి వానిముఖమును పరిశీలించి, "ఎంత దుడ్డు అవుతుంది?" యని ప్రశ్నించెను.

పురు—ఎంతో లేదక్కా! ఒక్కరూపాయి.

యువ—అబ్బో! అంతపెట్టి కోయులం కొనగలమా?

పురు—అంతఖరీదుగల కంటె పెట్టుకున్నావు గందా! ఒక రూపాయి యిచ్చిగిన్నె కో:లేవూ?

యువ—మరే. ఇది నేను చేయించుకున్నా ననుకున్నావా? మొన్ననే యీ అడవికంటాక్టరుగారంట. నన్ను చూచి మెచ్చుకొని యిచ్చిపోయిండు. అయినా ఇది అమ్మితే నాల్గురూపాయిలైనా రావు.

పురు—పదిరూపాయి లిస్తాను. నాకు యిస్తావా?

యువ—మాదొరతో చెప్పి యిస్తా.—అని యాయువతి యా జనసమ్మర్ధమునుండి వెలువడెను. ఆపురుషుడు కూలివానితో నేదో కండ్లతో మాట్లాడి యామెను వెంబడించెను. ఆయువతి యూరుదాటి యరణ్యమధ్యమునబడిపోవుచుండెను. పురుషుడుకూడ నిశ్శబ్దముగ నామెను వెంబడించుచుండెను. ఎంతదూరము నడచినను నాబాట తరుగుటలేదు. మామూలుగా తిరుగుచుండువారు కాని నామార్గమును గుర్తింపలేరు. అదురు బెదురులేక, మధ్యమధ్య వెనుదిరిగి యాపురుషునివైపు చూచుచు, యాలలన మోమున చిరునవ్వు తాండవించుచున్న మందగమనయై పోవుచుండెను. పురుషుడెట్టకేలకు ప్రాణము విసిగి, "అక్కా! యింకెంతదూరము పోవలెను?" యనెను.

యువ—దగ్గరకు వచ్చాము. కూతవాటు దూరంలో వుంది భయం పడకు. నువ్వు వెంటనే తిరిగి రానక్కరలేదు. హాయిగా అక్కడే పడుకోవచ్చు. నీ కేమీ లోటులేదు. వరిబువ్వ పెడతాము. మా దొర చాల మంచివాడు.—అని పలుకుచు నాయింతి, యాపురుషుడు తన్ను సమీపించిన వెంటనే చిరునవ్వు నవ్వుచు నడువసాగెను. ఆపురుషుడామె నిజముగ కోయజాతి స్త్రీ కాదనియు, తన్ను మోసగించుటకే, యిట్లు దోడ్కొని పోవుచున్నదనియు తలంచి, ధైర్య మువల

బించి, యాతరుణి చూపులలో చూపులు, మందహాసములో మంద హాసము, అడుగులలో నడుగులు కలుపుచు పోవుచుండెను. ఇట్లు వారిరువురును పోయి పోయి తుద కొకపర్వతము దరికిఁ జేరిరి. ఆయువతి యాతని సమీపించి, "ఇక్కడనుండి కొంచెము దూరము దాక దారి కిరువైపులు పెద్దపులులు మొదలైనవి ఉంటాయి. భయము వేయకుండా యుంటుంది. కళ్ళకు గంతలు కడతా" నని చెప్పి యాపురుషుని కన్నులకు గంతలు కట్టుచుండెను. ఆపురుషుఁడు తనలో నేమేమో యాలోచించుకొనుచు నామె చేసిన ట్లెల్ల యంగీకరించుచుండెను. ఆపడతి యాతనికి గంతలు కట్టి చేయూత నొసగి నడిపించుచు కొంతదూరముపోయి యచట నేలపైనున్న యొకతలుపును తెరచెను. అది యొక లోయ. ఆ పురుషుని యాలోయ వెంబడి తీసికొని పోవుచుండెను. మఱికొంతదూరము పోవుసరికి కాబాట మరల భూమికివచ్చెను అచ్చటకూడ నొకద్వారముండెను. ఆద్వారము దాటిన తరువాత నాతరుణి యాతనిగంతలు విప్పి వైచెను. ఆపురుషుఁడు కన్నులు నులిమికొని నాల్గువైపుల జూచెను. మూడువైపుల కొండ లుండెను. నాల్గవవైపున పాతాళలోకము వలె నుండెను. ఆకొండలలో నొకకొండ మొదట నొకగృహ మున్నట్లు దీపకాంతివలన గ్రహించెను. సామాన్యమానవు లాప్రదేశమున నిలచి క్రిందకు చూచిన కన్నులు గిర్రున తిరిగి క్రిందపడి శరీరము తునాతునియ లగుట సత్యము. వారు నిలువబడినది యాపర్వతముపై నున్న యొక చదునుప్రదేశము. ఆప్రదేశము భూపట్టమునుండి సుమా రాఱు వంద లడుగులయెత్తున నుండెను. ఆపురుషుఁడు చోర నివాసము చేరితి మని తలంచెను కాని ధైర్యము మాత్రము విడువలేదు.

మరుక్షణముననే వారాగృహము చేరిరి. ఆయువతి తలుపు తట్టెను. వెంటనే యొకవృద్ధుడు తలుపు తీసెను. వారిరువురును లోనికి పోయిరి. ఆసతి యాతని నొకగదిలోనికి తీసుకపోయెను.

ఆగది చాల సుందరముగ నుండెను. ఒకవైపున దంతపుకోళ్ళతో చేయఁబడిన పందిరిమంచము, వేరొకవైపున నాల్గుపకకుర్చీలు కలవు. స్త్రీ యాతని నొకకుర్చీపై కూర్చుండబెట్టి యిప్పుడే వచ్చెదనని చెప్పి వెడలిపోయెను. ఆపురుషుడు దీర్ఘాలోచనాపరుఁడై యాకుర్చీలో కూర్చుండి అటుకవైపునకు చూచుచుండెను. ఆగృహము తా ననుకొనినంత యసహ్యముగ లేదు. అది యొక ధనవంతుని గృహమువలెనే యుండెను. నాల్గుగోడలపైనను నాల్గుపటములు లున్నవి. అన్నియు మహారాష్ట్ర నాయకుడగు శివాజీవే. ఇచట నున్నవారందరును కొండమనుష్యు లగుచే నాకొండయొక్కకులగు శివాజీని పూజించుచుండిరని గ్రహించెను.

ఇట్లాతఁ డాలోచనామగ్నుఁడై యొకగంట కూర్చుండెను. ఆగంటయు నాతనికి బాహ్యజ్ఞానము లేదు. ఎచ్చట నేమి జరుగుచున్నది, ఆగదిలోని కెవ్వరు వచ్చినదియు కూడ నాతఁ డెరుగఁడు. తెలివి గాంచి చూచుసరికియాతనిచుట్టును పదిమందిపురుషులు పిస్తోలులన్నియు నాతని వక్షమునకు గురిపెట్టి పట్టుకొని నిలువబడిరి. వారిని చూచినవెంటనే యాధీరోదారుఁడు గూడనించుక చలించెను ఆపురుషు లందరును నొకేరూపము, నొకేరకపుదుస్తులు ధరించి యిసుమంతయు వ్యత్యాసమును నిరూపించుట కవకాశము లేకుండ నుండిరి. తాను వెంబడించిన స్త్రీ దివ్యవస్త్ర భూషణాలంకృతయై రెండవ రతీదేవియో యన కనులు మిరుమిట్లుగొల్పునట్లుప్రకాశించుచు యాపందిరిమంచముపై కూర్చుండెను. ఆమె చిరునవ్వుతో యాపురుషుని జూచి "దుర్మార్గుడా! రెండువందలు ఖరీదుగల వస్తువు పదిరూపాయలకు కొనెదవుగా! ఇప్పుడు నిన్నెవ్వరు రక్షింపగలరు"? అని పలికెను

పురుషుఁ డాలోచించుచు ప్రత్యుత్తర మీయలేదు. యువతి తన యనుచరులతో "వీనిని తీసుకపోయి చీకటిగదిలో బంధించుడు.

వీడు కడుదుర్మార్గుడు. అజాగ్రత్త చూపినచో మనల పాతాళమున కణగద్రొక్కును" అని పలికి యాపురుషునివైపు తిరిగి చిరునవ్వుతో, "కమలాకరం! పాపము, చివరకు స్త్రీచేతిలో చిక్కితివి. 'సిగ్గుసిగ్గు' అని పక్కున నవ్వెను. పాఠకులారా! ఆపురుషుఁడు పత్తేదారు కమలాకరమా! పాప మాత డెంతసునాయాసముగ శత్రువుల చేతులలో చిక్కెను!

కమలాకరము కూడ నామెతోపాటు నవ్వుచు 'నంతసింపకుము చిక్కుట చిక్కింపుకొనుటకే గాని, యొక్కసారి యాకంటె చూడనిమ్ము. వలదు-దాని పై నున్న యక్షరములు చెప్పుము' అనెను. ఆస్త్రీ 'కంటె యెందులకు? దీనిపై నక్షరములు లేవు. ఇది మీసర్కిలుదొరగారి భార్యది. మాదొర దామోదరశాస్త్రియైనపుడు దీనిని తెచ్చి నాకిచ్చె' ననెను కమలాకర మాశ్చర్యపడెను. ఇంతలో నాపురుషులు వానిని గొనిపోయి యొకచీకటిగదియందు పడవైచి ద్వారమును బంధించిరి. ఆయువతి వారలతో నేమేమియో రహస్యముగా తెలిపి, యావేషముతోడనే యాగృహము వీడి యరణ్యమధ్యమున నంతర్ధాన మయ్యెను.



# బంధవిమోచనము.



చీకటిగదిలో బంధింపబడిన కమలాకర మేమయ్యెను? అసమానమేధావియగు నాతఁడే బోనున చిక్కినప్పు డాతనిఁ దప్పించువారెవ రుందురు? పాప మింటిపట్టున సుఖముగ తిని కూరుచుండక పరమార్థచింత నూహించి కోరికోరి యిక్కట్టుల పా లయ్యెను. పొరపాటు, అంద రిట్లు స్వార్థపరాయణులే యైనచో ననాథలకుదిక్కెవ్వరు? అతడు చీకటిగదిలో నుండ మన మీగ్రామమున నుండుట భావ్యము కాదు. మనముకూడ నచ్చటికే పోవుదము. మనయాత్మ లెంతదుర్గమ ప్రదేశములనైనఁ జొరబడగలవు.

కమలాకర మట్లు బంధితుఁడయ్యును, ముఖమునందలి సహజకాంతినిగాని, మనోధైర్యముగాని విడువక యాగది యంతయు పరిశీలింప మొదలిడెను. గది చాల యసహ్యకరమై యుండెను. అతఁడట్లు పరిశీలించుచుండ బయట నెవ్వరిదో యడుగులచప్పుడు వినవచ్చెను. నిశ్శబ్దముగ నాధ్వని నాలించుచు కమలాకర మాలోచనా నిమగ్నుడయ్యెను. తా నున్న గదిప్రక్క-గది తెరువబడెను. ఒకకఠోరస్వరము "రంగనాథం! రంగనాథం! ఇప్పటికైనఁ జెప్పెదవా?" యని ప్రశ్నించుట వినబడెను. ఏమి తనప్రక్కగదియందే రంగనాథము బంధింపఁబడియుండెనా? మరల కంఠస్వరము వినవచ్చెను. "నాజీవము లుండగ నానోటనుండి చెప్పింప జాలవు". ఆకంఠస్వరము నిజముగ రంగనాథమూర్తిదే. కమలాకరున కాశ్చర్యానందము లొక్కసారి యావహించెను. మరల నాకఠోరస్వరము, ,,నీ వాపిస్తలు మాయధీనం చేసినంగాని నీకు విముక్తి లేదు'' మరల ద్వారమును బంధించినచప్పుడయ్యెను' అడుగుల చప్పుడుకూడ వినబడుట యాగిపోయెను.

కమలాకరము తానెట్టులైన రంగనాథమూర్తిని గలసికొని యా పిల్లలవృత్తాంత మెఱుంగవలెనని యూహించెను. కాని, సాధనము కనుపించలేదు. తనగది యంతయు పరిశీలింప నొకమూలలో నొక యినుప కడ్డీ దొరకెను. దానిం గైకొని యా రెండు గదులమధ్యనున్న గోడను త్రవ్వుట కారంభించెను. అతిప్రయాసపై నందులో నొకచిన్నరంధ్రము చేసెను. ఆరంధ్రముగుండా చూచెను. కాని, లోపలివ్యక్తిని పోల్చుకొనుటకు వెలుతురు లేదు. మరల నారంధ్రమును పెద్దదిచేయ ప్రారంభించెను. క్రమముగ మనుజుడు దూరుట కనువగునంత పెద్దకన్నము చేసి యాకన్నముగుండా సీవలగదిలో ప్రవేశించి "రంగనాథం!" యనెను.

రంగ—ఎవరు నీవు?

కమ—బిగ్గరగ మాటలాడకుము. నేను కమలాకరమును. అని పల్కుచు నాతని సమీపించెను. రంగనాథ మగ్గిపుల్లవెలిగించి కమలాకరుని చూచి యాశ్చర్యపడెను.

పత్తేదారుగారూ! ఇచట కెట్లు రాగల్గిరి?

కమ—బంధితుడనై వచ్చితిని.

రంగనాథమూర్తి యాశ్చర్యపడెను. "మీరుకూడ బంధించబడిరా?"

కమ—ఆశ్చర్యమేమున్నది? వీలు తప్పిన నందర మొక్కటే. కాని యిచటనుండి మనము దాటిపోవుట కేమైన నుపాయమున్నదా?

రంగనాథమూర్తి హీనస్వరము విని, కమలాకరము తనమొలకు కట్టిన రొట్టెలమూటను విప్పి 'రంగనాథం! ఈపదిదినములనుండి భోజనము లేదు కాబోలు. ఈరొట్టెలు భుజింపు" మని యాతని కందిచ్చెను. అతడు వానిని భుజించుచుండెను. కమలాకరము తప్పించుకొనిపోవు నుపాయమునకై యాగదినంతయు పరికింపదొడగెను. ఒక గోడవద్దకు

పోవుసరికి బయటనుండి కారుకోడికూతలు వినబడెను. సంభ్రమముతో రంగనాథమును సమీపించెను. అప్పటికాతఁడు భుజించుట పూర్తి యయ్యెను.

కమ—“రంగనాథ్! మన మాగోడకు కన్నముచేసినచో నరణ్యమున బడుదుము. తరువాత నుపాయ మాలోచింత”మని పలికి యిరువురు నాగోడ త్రవ్వసాగిరి. అచిరకాలములోనే కన్న మేర్పడెను. వెంటనే వారిరువు రారంధ్రముగుండా బయటకువచ్చిరి. అప్పుడు వారున్నది మహారణ్యము. ఎట్లుపోవలయునో తెలియుటలేదు. వా రట్లే భగవంతునిపై భారమువైచి, ధైర్యకంచుకము దొడగి యాయడవి కడ్డుపడిరి. మధ్యమధ్య వారు వినుచుండిన క్రూరమృగార్భాటములు వారినే వ్యాకులమానసుల నొనర్చెడ పాంథులగతి వేర చెప్పవలెనా?

వా రట్లుపోవుచుండ నాదుర్గమమార్గమునంగల ముండ్లడొంకలు శరీరమంతయు చీరుచు నెత్తురుమయము గావించుచుండెను. రాత్రిసమయము. శరీర మగ్నికుండములో బడినట్లు భగ్గున మంట లెత్తసాగెను. వారెట్టులో యాబాధలనెల్ల సహించి యతిప్రయాసపై నెట్టకేల కొక పెద్దబాట చేరిరి. ‘బ్రతుకుజీవుడా’ యని యాబాటవెంబడి నడువసాగిరి. అది వారిని క్రమమున నాకొండ దింపి భూప్రదేశము చేర్చెను- వారు మాత్ర మాదారి విడువక నడువ దొడంగిరి.

అది ఫారెస్టుశాఖవారిచే నేర్పరుపబడిన మార్గము- అది సరిగ తునికి చేరువను నొకకోయగ్రామము చేరెను. వెన్నెలరాత్రి యగుటచే వారి కాయూర నొకబంగాళా కనుపించెను. వారాబంగాళాచేరి యచ్చట పరుండిన యొకజవానును లేపి “లోప లెవరున్నా”రనెను, “రేంజరుగా”రని యతడు జవాబిచ్చెను. కమలాకర మాతని నంతటితో విడువక “ఓయీ! మీరేంజరుగారిని లేపి యీచీటి వారికి”మ్మనెను. అతఁడు విధిలేక యాచీటితో లోనికిబోయి, యది రేంజరుగారి కందించెను. అతడ

చూచి తత్తరముతో బయటకువచ్చి, 'డిప్యూటీఫుగారూ! లోనికి దయ చేయుండి, ఎక్కడనుండి' యని వారిని లోనికి గైకొని యాసీనులం జేసెను.

రంగనాథము దీపము వెలుగున నాతని జూచి, 'ఓహో! తిరుపతి గారా! ఇక మాకుభయములేదనెను.

కమ—రేంజరుగారూ! మేమిప్పుడు ఘోరవిపత్తునుండి వెలువడి యతిప్రయాసతో నడవి కష్టపడి యిచ్చటకు చేరగల్గితిమి. మే మిప్పుడు భద్రాచలము పోవుసాధన మొనర్పవలయును.

రేంజరు, వారిశరీరమందలి గాయములు నెత్తురమరకలు చూచి యాశ్చర్యపడి, 'ఇప్పుడంత తొందర యేమి? ఉదయమున నందరమును పోవచ్చు'ననెను. కమలాకరము 'లేదు లేదు-క్షమించండి' యనెను. వెంటనే తిరుపతిగారు బండివానిని పిలచి, 'వీరిద్దరిని భద్రాచలములో విడిచి మరల బండితోలుకొనిరమ్ము'అనెను. వాడు వెంటనే బండి సిద్ధపరచెను. ఇరువురును బండినెక్కిరి- గంటలో నాబండి భద్రాద్రి చేరెను. ఇరువురును బండి దిగి బండివానిని సాయంకాల మగుపడవలసినదిగా జెప్పి, కమలాకరుని గృహముచేరి శేషరాత్రి యచటనే నిద్రించిరి.



# మఱియొక విపత్తు.



కమలాకరము, రంగనాథమూర్తిని విడిపించుకొని వచ్చెనని విని, యుదయముననే సూపరింటెండెంటు దొరగారు కమలాకరుని దర్శింప వలయు నని వచ్చిరి. లోనికి పోయి చూచెను. చావడియం దిరువురు చెరియొక శయ్యపై గాఢనిద్రాముద్రితులై యుండిరి. వారిని లేపుట కిష్టములేక యాతఁ డాచెంతనున్న యొకపడకకుర్చీలో కూర్చుండి పేపరు చూచుకొన సాగెను. మరియొకగంటకు కమలాకరము నిద్రనుండి మేల్కాంచి, దొరగారిని చూచి, "ఎంతసేపైనది మీరు వచ్చి?" యనెను.

సూప—సుమా రొకగంట యైనది.

కమ—లేపక పోయితిరా?

సూప—బడలిక చెంది నిద్రించుచుంటిరని తలంచి లేపలేదు.

కమలాకరము, రంగనాథమూర్తిని లేపి, యిరువురును కాలకృత్యములఁ దీర్చుకొనిరి. కాఫీ తీసికొని ముగ్గురును సంభాషణకు గడంగిరి.

సూప—కమలాకరంగారూ! మీ కీరంగనాథ మెట్లు లభించెను?

కమ—చాలవృత్తాంతము కలదు. దాని కేమి కాని; మీ రింత జీతము తెచ్చుకొనుచున్నారుగదా! మీభార్యకు నగ లేమైన చేయించి తిరా?

సూపరింటెండెంటు యీప్రశ్నయర్థ మేమో తెలియక నివ్వెఱ పోయెను. "చేయించ కేమి? పెళ్ళినాఁడు చేయించిన నగలు కాక మొన్ననే నాల్గుజతలు గాజులు, కంటె, చెంపస్వరములు చేయించి తిని" యనెను.

కమ—ఆమె యిప్పు డవన్నియు ధరించుచుండెనా?

సూప—పదునై దుదినముల క్రిందట మెడవద్ద కురుపువేసి కంటె దాచినది. మిగిలిన వన్నియు నామె శరీరముననే యున్నవి.

కమ—కంటె చాలనేర్పుగా చేయబడెనని వింటిని. ఒకసారి తెచ్చెదరా. చూచెదను. పోనిందు, బంట్రోతును పంపుద మనెను.

సూరింటెండెంటు, భార్య కుత్తరము వ్రాసి జవాను కిచ్చి పంపెను. అత డొకగ టలో తిరిగివచ్చి "బాబూ! ఇనుపపెట్టెలో నుంచిన కంటె కనుపించుట లేదట" యనెను. దొరగా రాశ్చర్యపడిరి. కమలాకరము మాత్రము చిరునవ్వుతో దొరగారూ! భయపడకుడు. కంటె చోరులకడ భద్రముగ నున్నది. దాని నా చోరాగ్రేసరుడు పట్టపవలు మీ రింటనుండగనే సంగ్రహించి యాతని ప్రియురాలి కిచ్చెను.

దొరగా రచ్చెర వందుచు, ప్రియురాలా! దొంగలలో స్త్రీలు కూడ నుండిరా? యనెను.

కమ—సరిసరి! స్త్రీలేని నాటకమే యుండదు. పాప మామెయే నన్ను వారింటి కతిథిగ దీసికొనిపోయి చీకటిగది విడిదియొసగి, కవాట బంధనమర్యాద గావించెను. నేనుకూడ యామె యాహ్వానమర్యాదాదు లానందంబున స్వీకరించి మరల వచ్చునప్పు డొంటిగ వచ్చుట భావ్యము గాదని యెంచి యీ రంగనాథమును వెంటబెట్టుకొని వచ్చితిని. కంటె బహుమతిగా తెచ్చుకొనవలెనని యూహించితినిగాని వీలుపడినది కాదు. మరచితిని, రంగనాథ! రాత్రి యెవ్వరో నిన్ను పిస్తోలుసంగతి యడుగుచున్నాడు. పిస్తోలు ఎక్కడిది? దేని విషయము?

రంగ—అదియే నన్ను బంధించుటకు కారణము. పదిపత్సరముల క్రిందట నొక కేసులో పనిచేసి విజయముగా చినప్పుడు నాకు గవర్నమెంటు ఏజెంటుదొరగా రొక్క రెండుబారులతుపాకి నొకటి బహుమతి యొసంగిరి. నేను దాని నప్పటినుండియు మనస్సేమరుతో

నొకచోట దాచియుంచితిని. దానిని చేతఁబట్టుకొనినచో వందమందినైన సునాయాసముగ నెదిరింపవచ్చును.

సిమ—అది నీవద్ద నున్నట్లు వారి కెట్లు తెలియును?

రంగ—ఏమో నే నెరుఁగను!

కమ—దాని నిట్లు తీసికొని రమ్ము చూతము.

రంగనాథమూర్తి వెడలిపోయి, పిస్తోలుతో ప్రవేశించెను. అది ప్రస్తుత ముపయోగములో లేదు. కమలాకరము దానిని బాగుచేసి దానిలోనికి గుండ్లు వగైరాలు పైనుండి తెప్పించెను. రంగనాథ మూర్తికి పదిదినములనుండి భోజనాదులు లేనందువలన నీరసముచే నాల్గుదినములు సెవు గైకొనెను. ఆనాల్గుదినములుకూడ కమలాకరము విశ్రాంతి తీసుకొనదలచెను.

పాఠకులారా! పాపము కమలాకరునితో పోయిన కూలివానిని కోయగ్రామమున విడిచివచ్చితిమి. ఆతనిసంగతి యేమయ్యెనో తెలిసికొనకుండుట న్యాయముకాదు. మిమ్ముల దీర్ఘప్రయాణము పాలు చేసిన నాకలమును మన్నింతురుగాక!

మన మిపుడు భద్రాచలము దాటి యెనిమిదిమైళ్ళు వచ్చితిమి. కూలివాడు పెట్టెలన్నియు సర్దుకొని కావిడి భుజముపై నిడుకొని, "కమలాకరము దొంగలచేతిలో చిక్కియుండును. లేకున్న నింతవరకు రాకుండునా? ఆతని తప్పించు టెట్లా"యని యాలోచించుకొనుచుండెను. ఇంతలో నెవ్వడో యొకదీర్ఘకాయు డాతనిదారి కడ్డమై "దుర్మార్గుడా! నీవుకూడ మీయజమానుని మార్గ మవలంబింపవలయును. నిలువు"మని గద్దించెను. ఆతఁడు ప్రమాదము వచ్చినదని తలచి తనమొలలో రహస్యముగ దాచియుంచిన పిస్తోలుదీసి యాతనిని కాల్చెను. ఆవ్యక్తి నిర్జీవుడై పడిపోయెను. కావడిమోయుచున్నవ్యక్తి మరణించిన యాపురుషుని శరీరమంతయు వెదకి యాతనిమొలలో

నున్న బాకును తీసెను. దానిమీాద, "సర్వేశ్వరరావు"యని యున్నది. వ్యక్తి యాశ్చర్యమంది యిరువురు కోయలసహాయమున నామృత కళేబరముతో కమలాకరుని గృహముచేరెను.

కమలాకర మప్పుడే నిద్రనుండిలేచెను. మధ్యాహ్నము మూడు గంటలయ్యెను. కాఫీత్రాగి బయటకువచ్చెను. తనజవానును చూచి సంతోషించెనుగాని, వెనుకనున్న శవముమాత్రము కొంత సంతోష భంగము గావించెను. జవానువలన జరిగిన సంగతులన్నియు తెలిసికొని సూపరింటెండెంటున కొక చీటివ్రాసి పంపెను. ఆచీటియందు జరిగిన విషయమంతయు వ్రాసి "నేను శవమును పరీక్షించితిని, సర్వేశ్వరరావు మాత్రముకాదు, కాని సర్వేశ్వరునిబాకు యీతనికడ నుండుటబట్టి సర్వేశ్వరరావు యిక్కట్టుల చిక్కెననుటకు సందియము లేదు.మన ముపేక్షించుట కూడదు. నేడే మరల సాయంకాలము బయలుదేరుచున్నాను"అనివ్రాసి యొకరక్షకభటుని కాయుత్తరమిచ్చి దొరగారి కిమ్మని పంపెను.

తన జవాను స్నానముచేసి భుజించిన వెనుక యిరువురునుకలసి గోదావరీతీరమునకు షికారుపోయిరి.



# ప్రాణాపాయము.



పాఠకులారా! మన మొకసారి మారువాడీయింటికి పోవుదము. మారువాడీ తనస్థానమునఁ గూర్చుండి లెక్కలు చూచుకొనుచుండెను. కొంతసేపయినతరువాత నాతడు పుస్తకములు మూసి లోనికి పోయెను. ఆభవనము చాల పెద్దది. లోన సామాను లేమియు లేవు. ఒక్కగదిలో మాత్రము నాలుగైదు గిన్నెలు, కొన్నిచెంబులు, ఒకయినుప మందసము కలవు. ఆగదిలో నొక నులకమంచము, ఒక మడతమంచము కలవు. ఆనులకమంచముపై నొకపురుషుడు పరుండియుండెను. అతడు సుమారు ముప్పదియైదు వత్సరముల వయసు గలవాఁడు. సుదర్శలాలు ఆపురుషుని సమీపించి, "దాదా! బజారునకు పోయి కాఫీ తెచ్చి పెట్టెదవా!" యనెను. వెంటనే యాపురుషుడు మరచెంబు గైకొని వెడలిపోయెను. దాదా వెడలిపోయిన తరువాత లాలు మడతమంచము పై గూర్చుండి యాలోచింపసాగెను.

వీధిలోనుండి యెవ్వరో "సుదర్శనలాలుగారూ!" యని పిలచిరి. లాలు వీధిగుమ్మమునకు పోయి చూచెను. ఒకపురుషుఁడు పాశ్చాత్య వేషధారియై యాతనియెదుట ప్రత్యక్షమయ్యెను. ఆపురుషుని జూచి సుదర్శనలాలు "ఎవరు మీరు? నాతో నేమి పని?" యనెను.

పురు—మీరేనా సుదర్శనలాలుగారు?

సుద—అవును, దయ చేయుఁడు.

పురుషుఁడు "చిత్తము"ని లోనికి పోయెను. ఇరువురు నాసీనులైరి. పురుషుడు మారువాడీని బాగుగ పరిశీలించి, "అయ్యా! నాకు మీరొక యుపకారము చేయవలయును. రేపురాత్రి నాకు వివాహ

నసువులు చేయించుట కిప్పు డవకాశము లేదు. మా వంశాచారము ప్రకారము ముహూర్తసమయమున నగ లుంచవలెనుగాని రొఖ్ఖ మిచ్చుట తప్పు. కావున మీవద్ద తయారయిన నగలున్నవని తెలిసి వచ్చితిని.

సుద—ఉన్నవి కాని వానిని విక్రయింప దలంచుకొనలేదు.

పురు—ఎందుచేత?

సుద—కారణ మడుగవలదు. ఇప్పు డావిషయ మెవ్వరికి నెరింగింప దలచుకొన లేదు.

పురు—నే నెరుగుటవలన ప్రమాదము లేదుకాని నా కావిషయ మవసరము లేదు. మా కావస్తువు లెగువుగా దయచేయగలరా? వాని ఖిమ్మత్తున కిబ్బడియగుద్రవ్యము మీవద్ద హామీగానొసంగెదను.

సుదర్శనలా లాలోచించుచుండెను. అది చూచి యాపురుషుడు "అయ్యా! నా కిచ్చుట కంగీకారము లేనిచో వానివేయుడు. ఖరీదిచ్చు నప్పు డెవ్వరైన నిచ్చెదరు." అని లేవబోయెను. ఆలేచుటలో నొకదర్శన సెలవుపత్రిక (Visiting Card) క్రిందపడెను. దానిపై "కమలాకరము" అని యుండెను. ఆచీటి చూచి సుదర్శనలాలు ఆశ్చర్యచకితుండై, "అయ్యా! మీతో కొంచెము ముచ్చటింపవలయును. నేదెల్పు విషయములు కొంతకాలమువరకు నెవ్వరికిని ప్రకటింపనని వాగ్దాన మొనర్చు" డనెను. పాఠకులారా! ఆ వచ్చిన పురుషుండు కమలాకర మనుటకు మీ కింకను సందేహ మే మున్నది? అవును, అతండు కమలాకర మే.

కమలాకర మాతనికి వాగ్దాన మొసంగెను. సుదర్శనలా లాతని లోపలిగదిలోనికి తోడ్కొనిపోయి చాలసేపే మేమో సంభాషించుకొనిరి. కాఫీకి పోయినపురుషుండు కాఫీ, టిఫిను తీసికొనివచ్చెను. వీధి గుమ్మమున కా రున్నది. దానిని చూచి యాతడు నిర్ఘాంతపోయెను.

మాటాడకుండ లోనికిపోయి కాగితగ్రరాలను చావిడిలో నుంచి, దొడ్డివైపునకు పోయెను. అట్లు పోవుచు నాతఁడు తనమొలలోని రివాల్వరును సరిచేసికొనెను.

సుదర్శనలాలు కూర్చుండిన గదిలోనుండి దొడ్డివైపున కొక కిటికీ కలదు. పురుషుఁ డాకిటికీగుండా లోనికి చూచెను. ఆతఁ డెన్నడును కమలాకరమును చూచి యెరుగడు, కమలాకరుని చూచి భీకరాకారుఁడై రివాల్వరు నాకిటికీగుండా కమలాకరునికి గురి చూచెను. ఆహా! నేటితో కమలాకరునిపని ముగియుచున్నది. సంక్షోభించుచు కమలాకర మా దెసకు చూచెను. నిర్ఘాంతపడెను. ఇంతలో రివాల్వరు 'ఢాం' మని ప్రేలెను. గది యంతయు ధూమముతో నిండిపోయెను. కమలాకరము పడుండిపోయెను.

ఇట్టి విపరీతకృత్యము జరుగునని సుదర్శనలాలూహింపలేదు. వెంటనే తలుపు తెరచి చూచెను బయట తనసహచరుడు ఆతని లోనికి రమ్మని యతఁడు చేసిన ఘోరకార్యమునకు చీవాట్లు పెట్టి యిరువురును కమలాకరుని పరీక్షింపసాగిరి. కమలాకరము చిరునవ్వుతో లేచెను. "లాలూ! భయపడకుము. నా కేమియు దెబ్బ తగలలే" దనెను. పురుషుఁడు తెచ్చిన ఉపహారమును, కాఫీయు మువ్వురును తీసికొనిరి. తరువాత కమలాకరము సుదర్శనలాలువద్ద సెలవుగైకొని వీధిలో తనకొరకు వేచియున్న మోటారుపై నింటికి పోయెను.

---

# కాంతము యొక్క కర్మఫలము.



బంధితయగు లక్ష్మీకాంతమ్మయవస్థ దుర్భరముగా నుండెను. మూర్తీభవించిన శోకదేవతవలె నున్న యాకోమలగాత్రిం గాంచిన నెట్టి పాషండపాత్రియుండైనను జాలిబూనకమానడు. కాని, యానరహంతకునకు—నా చోరాగ్రేసరునకు మాత్రము కనికరము కలుగుట లేదు. కామాతురులకు యుక్తాయుక్త పరిజ్ఞాన ముండదు కదా! వారు తాము పట్టినకుందేలునకు మూడే కాళ్ళనువారు. వారిని హితోపదేశములు మంచిమార్గమునం దిప్పజాలవు.

జీర్ణవసనయై, యపరిష్కృతశిరోజయై, శల్యావశిష్టయై యున్న యాతరుణి నాదరించువా రెవరు? ఆమె తనకర్మఫలమును వింద్దించుకొనుచు వాపోవుచుండెను. కాని యయ్యది యరణ్యరోదనము. దాని నాలించు వారు లేరు. "అక్కటా! నాజాడ తెలియక నాతలిదండ్రు లెంత వాపోవుచుండిరో? నాయగ్రజు డెంతగా గుందుచుండెనో? నా కొరకై మాయన్న, యత్తమామలు, భార్య యెంతదుఃఖాతురు లగుచుందురో? దైవమా! మమ్మిందర విచారగ్రస్తుల నొనర్చుట నీకు వినోదమా!" యని పరిపరివిధంబుల వాపోవుచుండెను. ఇంతలో నొక స్త్రీ యాద్వారమును తెరచుకొని లోనం బ్రవేశించెను. పాఠకులారా! మన మామె నొకపరిమాత్రమే తిలకించితిమి. నాడు కమలాకరుని మోసగించి బంధించిన నీలతాంగియే.

ఆమెవదన మతిభయానకమై శక్తిస్వరూపమువలె నుండెను. ఆభీకరాకారమును గాంచి లక్ష్మీకాంతము కెవ్వుమని యొక కేక వైచెను. స్త్రీసందర్శన మామె కిదియే మొదటిసారి. ఆకేక యం

దెట్టి మహాత్వమున్నదో తెలియదుకాని భయానకమై నిప్పులుగురియుచున్న నేత్రసన్నిభమైన యాస్త్రీవదనముయార్ద్రమై దయాపూరితమయ్యెను. "అక్కటా! పురుషజాతి చాలచెడ్డది. వానికి విశ్వాసమనునది యుండదు. దయాశూన్యము. స్త్రీలు వారలకంట బడుటయే పాపకరము. ఇట్టి మోహమదాంధులు దారుణహత్యలుగూడ నొనర్ప సాహసింతురు. అయ్యో! ఈదుర్మార్గుని మాయాకపటప్రవర్తనమువలన నెన్నిసంసారములు సాగరముపాలయి దుఃఖభూయిష్టము లగుచుండెడివో! వన్నితఁడు చేరదీసి, యొకస్త్రీని నిరసించుటయు, నామె దురాలాపముల కామెను వధించుటయు సాకన్నులార చూచితిని. ఇప్పుడాతనిమనం బీమెసౌందర్య మాశించెను. ఈకాంతా సౌందర్యబద్ధుడై నాకు వెనుకటిదారి చూపక మానడు. ఈమెదీనస్థితి చూచిన నాకుఁ జాల జాలి కలుగుచుండెను. ఈమె నోదార్చి విడిపించు నుపాయ మూహించెదగాక" యని తలపోయసాగెను. స్త్రీలకు స్త్రీలయెడ జాలి కలుగుట సహజము. ఆతరుణి మందగమనమున లక్ష్మీకాంతమును సమీపించి, "కాంతం! భయపడకుము. నేను నీ కపకార మొనర్చుటకు వచ్చినదానను గాను. నీహితమునకై వచ్చితి" ననెను.

లక్ష్మి—అమ్మా! పరాత్పరుఁడు నాకట్టి యదృష్టము చేకూర్చునని నే నూహింపజాలను.

స్త్రీ—ఎందుచేత?

లక్ష్మి—ఉన్నది శత్రుమధ్యము. ఇతరులు దీనిఁ జొరఁబడ నవకాశములేదు. ఇక నాకు హిత మెట్లుకలుగును?

స్త్రీ—అదృష్టమున్న నెచ్చటనైనను సౌఖ్యములు లభించును. అందులకు సందియములేదు.

లక్ష్మి—అట్టియదృష్ట మున్నచో నా కీగతి కలుగకయే యుండును.

స్త్రీ—కలిగిన నేమాయె? మనసుఖదుఃఖములు మనచేతులలో నున్నవి. సమయానుకూలప్రవర్తనానైపుణ్య మున్నచో నెచ్చటనైన సుఖపడవచ్చును. ఇచ్చట నీ కేమి లోటు కలదు? నీవు మాగృహ మంతయు నెప్పుడును జూడలేదు. శృంగారనిలయము. రెండవ వైకుంఠనగరము.

లక్ష్మి—అమ్మా! మీపలుకులు నా కర్థ మగుట లేదు.

స్త్రీ—ఇంత యమాయకురాలవు కావుననే, యిట్టిదురంత చింతాకులస్వాంతవు కావలసివచ్చెను.

లక్ష్మి—నా సౌఖ్యమునకు నే నేమిచేయవలెనో యించుక తెలుపుడు.

స్త్రీ—ఎవ్వరు నీయందు బద్ధానురాగులై, నీసౌందర్యవిమోహితులై, నీస్వరూపదర్శనమే సమస్తపాపజాలంబుల భస్మీపటలము గావింపగలవని భావించుచుండెనో యాపురుషునకు ప్రీతిఫలమొసంగిన సుఖపడగలవు.

లక్ష్మి—అమ్మా! ఇట్టిమాటయా! మీరు నాకు చెప్పవలసినది. స్త్రీయై పుట్టినతరువాత ప్రతియువతికిని ధర్మబద్ధమైన వివాహ మా సృష్టికర్త నియమించెనుగదా! అట్టివివాహమున నెవ్వ డేతరుణి గళంబున సూత్రము బంధించునో యాతఁడే యాలలన కన్నివిధముల పూజనీయుఁడు? అతనివాంఛిత మెట్టిదైన నాయువతి తీర్ప బద్ధురాలు. భగవంతుఁడు నా కట్టి నిర్భాగ్యమక మీవరకే యొనర్చెను. ఇప్పు డా పురుషుని లోఁగిసిరాజన యెన్నఁడు చూచి నెరుంగని యన్యపురుషుని యభీష్టము దీర్చు టేటిధర్మము? స్త్రీ యయ్యును పతివ్రతాధర్మముల పరికింపక నన్ని ట్లధర్మకృత్య మాచరింప బ్రోత్సహించుట న్యాయమా?

స్త్రీ—వెఱ్ఱిదానా! కలియుగమున ధర్మాధర్మముల పాటింప వలసిన యగత్యము లేదు. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" యను నార్యోక్తి ననుసరించి ముందు శరీర సౌఖ్యమును జూచుకొని తరువాత ధర్మమును తలపోయవలెను. అట్టి స్వకీయసౌఖ్యముల కంతరాయము గల్గించు నెట్టిబహుళధర్మమైనను లెక్కింప నగత్యము లేదు.

లక్ష్మీకాంతము నీవచనము లతిక్రూరకఠోరములుగాఁ దోఁచెను. ఆ స్త్రీతో సంభాషించుటకూడ పాతకమని తలపోసి మారుపలుకక యూరకుండెను. ఆమె యూరకుండుట చూచి యాతరుణి "ఎట్టియిక్కట్టులు కల్గినను యామె సతీధర్మముల విడుచునట్లు కాన్పింపదు. ఇట్టిపుణ్యచరితను ఘోరసంకటముల పాలొనరించి వేధించు టన్యాయము. ఈమె మనంబునం గలకంత శాప ప్రియత్నించెదగాక" యని తలపోసి యామెను సమీపించి బుజ్జగించుచు, తరుణీ! చింతింపకుము. నీకు శుభమగుఁగాక! నే పోయి వచ్చెద. ఇదిగో యీ తినుబండారములు భద్రపరచుకొని రెండుదినము లెట్టులో గడుపుము. పిదప శాశ్వత సౌఖ్యమనుభవింపఁగల" వని పలుకుచు నొకమూట నామె కొసంగి వెడలిపోయెను. లక్ష్మీకాంత మామూట విప్పిచూచెను. అందుమిఠాయి వర్గైరా ఫలాహారదినుసులు గలవు. పెన్నిధిగన్న పేదవాలె నాశిరీషకుసుమకోమలి యా ఫలాహారదినుసుల నాతురతతో తిని క్షుద్బాధ నించుక యుపశమింపఁ జేసికొనియెను. ఆమె మనమున కించుక యూరట కలిగెను. కాని, యాశాంతత చాలకాల ముండలేదు. విద్యుల్లత కాంతివలె నది మరుక్షణముననే మాయ మయ్యెను. దుర్భరదురంత చింతాసాగరమున కామెమరల నీడ్చుకొని రాబడెను.

దొంగలనాయకుఁ డామెయెదుట దండధరునివలె ప్రత్యక్ష మయ్యెను. అబలయగు నాస్త్రీ యాతని సమున్నతదేహము, రక్తాక్ష ద్వయము, భీకరాకారము గాంచి భయదుఃఖసమ్మేళనంబున నొడలు

తెలియక క్రిందపడిపోయెను. ఆగంతకుఁ డామెను పట్టుకొనకున్న యామె శిర మొకపాషాణముపైఁ బడి శతసహస్రభిన్నములు గావలసినదే కాని. పరాత్పరు డాదుఃఖమయసమయమున నామె నీప్రపంచమునుండి మాయ మొనర్చుట కంగీకరింప లేదు.

ఆగంతకుఁ డామెను మెల్లగ పరుండబెట్టి శీతలోపచారము లొనర్ప నారంభించెను. కొంతసేపటి కామె తెలివిగాంచి దొంగల నాయకునిఁ జూచి, "అయ్యా! నను ముట్టకుము. నాశరీర మతిపాప భూయిష్టము." అనెను.

దొంగ—నీశరీరము పాపభూయిష్టమైన గావచ్చును. కాని, నీ యంతరాత్మమాత్రము పవిత్రితము. తత్సేవాభాగ్యమే లభించిన నాజన్మ మెంతయు ధన్యము గాంచును.

లక్ష్మి—అన్నా! నీవుకూడ నావలె పవిత్రహృదయుఁడ వగుట కేల యత్నింపరాదు?

దొంగ—అనఘా!

లక్ష్మి—నేను పతివ్రతాధర్మముల పాటించునట్లే నీవుకూడ నేకపత్నీవ్రతనియమముల పాటింపినఁ బరాత్పరుఁడు సంతసించి సౌఖ్యముల నొసంగుటకు సందేహము లేదు.

దొంగ—వెఱ్ఱిదానా! అనురాగ మున్న వస్తువును గాంక్షించుట. కాంక్షించిన పదార్థమును సంగ్రహించుటకై పట్టువిడువక విజయము చేకూరువరకు యతన మొనర్చుటయు ధీరపురుషలక్షణములు. చూడు, పురుషున కనురాగయుతమగు వస్తు వేది? స్త్రీ. స్త్రీని మించిన కాంక్షణీయపదార్థము నాకు లేదు. నాసమస్తప్రాణధననిచయంబులును నా కనుకూలవతియై చరించు స్త్రీహస్తమున నుండును. ఇదియే నాజన్మ రహస్య. ఈరహస్య మెఱింగి యేయువతియు నన్ను నిరసించుటకు సాహసింపదు. నాయనురాగవిదూరయగు తరుణికి మరణమే శరణ్యము.

కాంతం! బాగుగ యోచించుకొనుము, అజ్ఞానురాలవు కావు. నీసౌఖ్య భంగము గావించుకొనుట నీకు పాడిగాదని యే మేమో యుపన్యాసవాక్యముల నాడఁ దొడంగెను. ఆపలుకు లన్నియు శరాఘాతంబులట్లు యాకుసుమకోమలి హృదయమున నాటుచుండెను. మూర్ఖులకు నీతి గఱప నెంచుట చెవిటికి శంఖ మూదినట్లు గదా! పైత్యరోగి కాహారమరుచింగలిగించునట్లు మూర్ఖచిత్తుండగు నాహంతకుని కామహితవచనంబులు రుచించునా! కల్ల, ఆతనిదురుద్దేశ మాతని బొందెలో ప్రాణములుండ తిరుగుట దుర్లభము. మరల లక్ష్మీకాంతముతో నిట్లు చెప్పసాగెను.

"కాంతం! నాపలుకు లన్నియు శ్రద్ధగ నాలోచించి ప్రత్యుత్తరమిమ్ము. నావద్ద నరువదివేలు రొఖ్ఖము గలదు. నలుబదివేల యాభరణంబులు గలవు. సుందరవస్తుపరిపూరితంబగు దివ్యహర్మ్యము కలదు. ఇవన్నియు నాహృదయముతో పాటు నీయధీన మొనర్చుచుంటిని. స్వీకరించి నను నీయాజ్ఞాబద్ధునిగా నొనర్చుకొని నీయనురాగవీచికల నూగులాడించుచు నాదరింపుము, అంతియ చాలు. నీవియోగమును భరింపజాలను. నీ వాలసించిన కొలది మనయిరువురకు గూడ ప్రమాదము సంభవించును. నాయాగ్రహమువలన నీకును, నీప్రణయవిరహమున నాకును చావు తప్పదు. రెండు నిండుప్రాణముల నాశన మొనర్చిన పాపము నీకుఁ జుట్టుకొనును. నామాట లాలించి నాకోర్కె దీర్చి, నీకును నాకును సౌఖ్యము చేకూరజేయుము" అని పరిపరివిధంబుల నాతరుణిని హితవచనంబులచే బ్రతిమాల ప్రారంభించెను.

లక్ష్మీకాంతమునకు నాపలుకు లేవియు చెవి కెక్కలేదు. దొంగల నాయకుఁడు నిర్దేశించిన పాపముకంటె పరపురుష సంగమము యెక్కుడు పాపదాయకమని యామె మనం బుద్ఘోషించుచుండెను. ఎవరెన్ని విధముల బోధించినను యామెమనము తిరుగుట యసంభవము.

ఆయువతి యేమియు ప్రత్యుత్తర మొసంగలేదు. ముఖమున, నొకవంక సంభవించిన కష్టపరంపరలవలన గలిగిన దుఃఖచిహ్నమును, వేరొకవంక భీకరాకారదర్శనమునం గల్గిన భయచిహ్నములును, వేరొకవంక నా దురాత్ముని పై పగ సాధించుకొను నుద్దేశమువలన గలిగిన రౌద్రి చిహ్నములును చేరి, యావదనమున కొకవింతశోభ నొసంగెను. ఆ దొంగలనాయకుఁ డామె మనోభావముల గ్రహించి, సామముచే చక్కఁబడదని తలంచి, యామె నొకపరి బెదరింప నెంచెను.

'తరుణీ! నాహితంబులు నీకు విషంబు లయ్యెను. నీకర్మఫలము నెవ్వరు తప్పింపఁగలరు? నీ కింకను గడు వొసంగెదను. మరల నీదినమున వచ్చెదను. అప్పటికి నీమనసు మార్చుకొని నాకు సంతస మొనగూర్చుటకు గాని, లేక నాక్రోధానలమునకు గురియై మరణించుటకు గాని, సంసిద్ధవు గమ్ము. ఇదియే నాకడపటివచన'మని పలికి యాతఁడు కవాటము నెప్పటియట్లు బంధించి వెడలిపోయెను. పాపము లక్ష్మీకాంతము కర్మఫల మెట్లున్నదో యింకొకవారమునకు తెలియును. విచారమగ్నయై రాబోవు విపత్తునకు విలపించుచు నాతన్వి యాకఠినపురానేల పరుండి నిద్రించెను.



# ఎత్తుపైయెత్తు.

కమలాకరమునకు నానాటికి పట్టుదల హెచ్చగుచుండెను. ఎటు లైనను వారముదినములలో నాచోరుల నందరిను బంధింపవలయునని సూపరింటెండెంటుదొరగారిని, రంగనాథమూర్తిని హెచ్చరింప దలచి పోలీసుస్టేషను చేరెను. అచట పోలీసుద్యోగు లెల్ల నాసీనులై రికార్డులు చూచకొనుచుండిరి. కమలాకరుని రాకగాంచి వా రెల్ల రాతని సగౌరవముగ నాహ్వానించిరి అందరు నాసీనులైరి. దొరగారు, "కమలాకరంగారూ! పనిమీదవచ్చిరా?" యనెను.

కమ—హంతకుల నంతమొనర్చుటకంటె పని యేమున్నది? నే నందుకొఱకే విజయనగరమునుండి యింతదూరము పంపబడితిని.

సూప— ఇప్పు డేమి చేయుదము?

కమ— మీరు రేంజరుగారిని కలసికొని యిరువురు వాచర్లను తోడుతీసికొని యీయరణ్యమునగల పర్వతప్రదేశము లన్నియు పరిశీలించుచు, ననుమానము గలుగు చోట్లనెల్ల జాగరూకులై విమర్శించుచు నాల్గవదినమున నిచటకు చేరవలయును. రంగనాథమూర్తి నలువుర రక్షకభటుల వెంటబెట్టుకొని దేవరపల్లిగుట్ట యంతయు తిరిగి యెక్కడనైన రహస్యబిలచిహ్నము లున్న నాయాస్థలముల గుర్తుపట్టుచు తిరిగి వచ్చును. నేనుకూడ నొకపనిపై బోయి యాదినమునకు వచ్చెదను. వెంటనే మన మందర మాహంతకుని బంధింపవలయును. వారము దినములలో నాతని న్యాయస్థానమున నిలువబెట్టవలయు- ననెను. అందరందుల కామోదించిరి. మధ్యాహ్నము మూడుగంటల కందరును భద్రాచలము వీడి నలువైపులకుఁ బోయిరి.

గోదావరీతీరమందున్న బైరాగుల మఠము బైరాగులచే నిండి యుండెను. వివిధవేషధారులైన బాలురు,యౌవనులు, కౌమారులు, వృద్ధులు స్త్రీపురుషు లాబైరాగులలో నుండిరి. వారు పవిత్రజీవులు. సర్వసంగపరిత్యాగులు. అందొకమూల నొకవృద్ధసన్యాసి కలడు. ఆతనిముఖమున బ్రహ్మవర్చస్సు తాండవింపజొచ్చెను. పట్టణమునుండి జనులు తండోపతండములుగ వచ్చి యావృద్ధసన్యాసిని దర్శించి యాతనికి ఫలపుష్పక్షీరాదులర్పించి, యాతనియాశీర్వాదముం బొంది వెడలిపోవుచుండిరి. గ్రామములు నాగారమవాసులే కాక పరిసర ప్రదేశములనుండికూడ జనులు వచ్చుచుండిరి. నాటి యుదయము మొదలు సాయంకాలమువరకును వచ్చిపోవు ప్రజల కింతులేదు. వచ్చినవారి నెల్ల నాదరించుచు హితోపదేశము గావించుచు నుండుచుండెను. ఆతని ముఖము కళావంతమై చిరునవ్వు తాండవించుచుండెను.

సాయంకాల మారుగంటలయ్యెను. ఆకాశమంతయు రాగిడి వర్ణము దాల్చెను. ప్రియాగమనమున కానందము నొందుచు పశ్చిమ దిక్కాంత వదనము తెలివిగాంచెను. ఆసమయమున నొకపురుషుడు సామాన్యవస్త్రులధరించి రేవుపడవదిగి మఠమును సమీపించెను. మఠద్వారము వచ్చిపోవుజనులచే క్రిక్కిరిసియుండెను. అందేదియో విచిత్రముండియుండునని తలంచి యావ్యక్తి జనసమ్మర్దము నొత్తిగించుకొని కడుప్రయాసపై లోనికిపోయెను. సాక్షాత్తు సాంబశివుని యవతారమో యనదగు నావృద్ధసన్యాసిం గాంచి సంతోషాంతరంగుడై యాతనిపాదపద్మములకు నమస్కరించి, "స్వామీ! నాకోరిక యెన్ని దినములలో తీరు"నని ప్రశ్నించెను. ఆవృద్ధు డాతనిహస్తమును పరిశీలించి పెదవి విరిచెను. ఆహస్తమున నదృష్టసూచక మొక్కడను గన్పించుటలేదు.

వ్యక్తి—స్వామీ! చెప్పరేమి? నాకోరిక తీరదా?

వృద్ధు—నాయనా! తీరుట కవకాశము గాన్పింపదు. మీరు మిక్కిలి రెండుమూడుదినములలో నీవు ఘోరసంకటమునకు గురి యగుదువు.

వ్యక్తి—తద్విమోచన క్షేమైన నుపాయ మున్నదా?

వృద్ధు—ఆవిషయము బాగుగ పరిశీలించినఁగాని చెప్పఁ జాలను. చీకటి పడుటచే రేఖలు స్పష్టముగ గాన్పించుటలేదు.

వ్యక్తి—ఘోరసంకటమనిన నెట్టిదో చెప్పగలరా?

వృద్ధు—శత్రువులు నిన్ను ముట్టడింతురు.

ఆపురుషుడు చిరునవ్వు నవ్వెను. ఆ నవ్వులో నాతనికింగల నిర్లక్ష్యభావము స్పష్టముగ గోచరించు చుండెను. ఆభావమును గమనించి యావృద్ధసన్యాసి, "నాయనా! శత్రువులచే చిక్కుటయనిన నీకంత నిర్లక్ష్యముగనున్నది. ఒక్కొక్కప్పు డది ప్రాణాపాయమును గూడ గల్గింపగలదు. నాహిత మాలించి సోమవారముమాత్రము కడు జాగరూకుడవై తగిన కట్టుబాట్లతో నుండుము. నాదగ్గరకు వచ్చినందు వలన చెప్పితిని. ఆపైన నీయిష్ట"మని యూరకుండెను.

ఆపురుషుఁడు సెలవు గైకొని వెడలిపోయెను. వృద్ధుఁ డింకను వచ్చిపోవువారలకు దర్శన మిచ్చుచునే యుండెను. పాఠకులారా! వెడలిపోవుచున్న యాపురుషుని ననుసరింతమా! నడువుడు. ఆతఁడు వడివడిగ నడచుచు నరణ్యమును ప్రవేశించెను. ఆబాట సుగమముగానే యుండెను. అత డెవరు? ఎచ్చటకు బోవును? మన మొకసారి యాబాట చూచితిమి. ఆబాట వెంబడినే నాఁడు కోయస్త్రీ కమలాకరుని మోసగించి తోడ్కొనిపోయెను. కొండను సమీపించువరకును మార్గము సుగమ్యము. బిలద్వారము చేరుసరికి లోపలనుండి పదిమందిదొంగలు వచ్చి యాపురుషునకు నమస్కరించిరి. పాఠకులారా! ఆతఁడే మన దొంగలనాయకుఁ డనుట కింకను సందియ మేమున్నది? నాయకుఁడు

వారి నందరను లోనికి రమ్మని యాజ్ఞాపించి తానుగూడ వారిని వెంబడించెను.

దురదృష్టదేవత నెత్తిరెక్కి యున్నప్పు డెవ్వరును ముందువెనుకలు పరిశీలింపరు. పాప మాదొంగలనాయకుడు కూడ తనవెంట నంటి వచ్చుచున్న పురుషునిఁ గాంచలేదు. ఆపురుషుడు కూడ వారివెంట లోనికి బోయెను. నాయకుడు వానియనుచరులతో సభ చేయుట చూచి వారికి కాన్పింపకుండ నొకచో డాగి వారిసంభాషణ మాలింప జొచ్చెను.

నాయ—మిత్రులారా! మీరు పోయినపనులయొక్క ఫలితము లెట్లు పరిణమించెను.

1 వ దొంగ—మీయాజ్ఞప్రకారము కమలాకరుని యింటికి పోయితిని. అతనిసేవకుఁడు సామాను లన్నియు సర్దుకొనుచుండెను. వానిని పిలచి మీ యయ్యగా రున్నారా యని యడిగితిని. అందుల కాతఁడు దుఃఖించుచు "అయ్యా! ఏమి చెప్పుదును? వారు మొన్నను దొంగలను పట్టుకొనుటకై పోయిరి. నిన్న నాయంకాల మాతనిశవము రక్షకభటుల కరణ్యములో దొరికెను. వెంటనే దానిని ఆసుపత్రికి పంపిరి. పదిగంటలకు డాక్టరుగారు శవముఁ బరీక్షించిరి. విషప్రయోగమువలన మరణించె నని తెలిపెను. అతఁడు చనిపోయిన పిమ్మట నాకిట నేమి పనియున్నది? మాయూరు పోవుచున్నా" నని ప్రత్యుత్తర మిచ్చెను. ఆమాట విని యాతనియెదుట నేను కూడ కొంతసేపు దుఃఖించి బయలుదేరి వచ్చితిని.

ఈపలుకుల కందర చ్చెరు వందిరి. కమలాకరుని మరణవృత్తాంతము వినినంత నాయకునకు సంతస మయ్యెను. రెండవవానివైపు తిరిగెను. అతఁడు నాయకుని యుద్దేశమును గ్రహించి తా పోయిన వృత్తాంత మిట్లు చెప్పఁ దొడంగెను.

"భద్రాచలము ప్రవేశించి సూపరింటెండెంటు దొరగారి యింటివద్ద పిలచితిని. ఆపిలుపున కాతనిభార్య కాబోలు- ఇరువది సంవత్సరముల యువతి సర్వాలంకృతయై వచ్చి తలుపు తీసి 'ఎందు' కనెను. నేను, 'అమ్మా! మాది నెల్లిపాక. దామోదరశాస్త్రిగారు పంపగా అయ్యగారితో మాట్లాడవలెనని వచ్చితి' నంటిని. వెంటనే యామె "వారితమ్ముని కనకాపల్లిలో వివాహము, అందులకై వెళ్ళిరి. మేముకూడ నేటిరాత్రిపై వెళ్ళుచున్నాము వారమునదినములలో తిరిగి వత్తు" మనెను. చేయునది లేక, 'చిత్తము. మరల వచ్చెద' నని పల్కి బయలుదేరి రంగనాథం యింటికి వచ్చితిని. ఆతడు జ్వరపీడితుడై యుండెను. డాక్టరు మంచమునద్ద కూర్చుండి మాటిమాటికి నాతనినాడి పరిశీలించుచుండెను. ఇంటనున్న సేవకులు, రక్షకభటులు కాలుకాలిన పిల్లులవలె నటునిటు తిరుగుచుండిరి. కొంత సేపటికి డాక్టరు వీధిగుమ్మమునకువచ్చెను. ఒకజవానును పిలచి రహస్యముగ, 'ఈతడు జీవింపడు తండ్రిగారికి టెలిగ్రా మిచ్చి రమ్మని' యంపి మరల యథాస్థానమునకు పోయి యౌషధసేవ ప్రారంభించెను. నేను మారుపలుకక వచ్చితిని" యనెను.

అందరును ఒక్కమారు "మల్లిఖార్జున మహాశయునకు జై" యని జయధ్వనులు మొదలిడిరి. ఆదొంగలనాయకుని పేరు మల్లిఖార్జునుడు గాబోలు! ఆతడు "మిత్రులారా! సోమవారము నాగ్రహచారము బాగుగ లేదు. నాడు గడచినగాని మనము విజయులము కానేరము. కమలాకరుని మరణవార్త యెంతవరకు నిజమో తెలియ" దనెను అంత నాయనుచరులలో నొకడు "నిజమే మూడుగంటలకు నే నాసుపత్రికి పోయినప్పుడు డాక్టరు రిపోర్టు వ్రాయుచుండెను. నా కండ్లార చూచితిని. అందు స్పష్టముగ Detectice was Poisoned to death. (పత్తేదారుడు విషప్రయోగముచే మరణించెను) అని

యున్నది. డాక్టరున కనుమానము కలుగకుండ మందు కావలెనని చీటి వ్రాయించుకొని వచ్చితి" ననెను.

దానితో కమలాకరము మరణించుట ధృవమని యందరును ధృవపరచిరి. నాయకుడు, "ఎట్లైనను సోమవారము మీరందరిచ్చుటనే ముగించవలె" నని యాజ్ఞాపించి తనగదిలోనికి పోయెను. అనుచరు లందరును లేచిరి. ఆరువ్రరుమాత్రము నిలచిపోయిరి.

1 వ, వాడు—మిత్రుడా! సూపరింటెండెంటు భార్య చక్కనిది. లాంచి తురకలగూడెము వద్ద కట్టు నట్లేర్పరచి వచ్చితిని. మన మిరువురము సైకిళ్ళపై బోయి యామెను మోసగించి తీసుకపోయి యుండేని సుఖింతము.

2 వ, వాడు—అయిన లోనికి పోయి పోలీసుదుస్తులు ధరించి వత్తమని యిరువురు వెడలిపోయిరి.

ఈసంభాషణ మంతయు వినుచు మరుగున డాగియున్న యువకుడు నతసించుచు నా పర్వతమునుండి క్రిందికి వచ్చి భద్రాచలమువైపునకు నడువసాగెను. పాఠకులారా! అతడు పోలీసుశాఖకు సంబంధించిన వాడని వేరె చెప్పవలెనా? పోలీసుశాఖవాడైనచో చోరుల నట్లు విడిచి వచ్చునా యని యేల మీసందేహము? అందులకు కారణము లేకపోలేదు. ముందు విపత్తునకు గురియగుచున్న దొరగారిభార్యను విడిపించవలెను. అందుచే నాతడతిరయమున భద్రాద్రి చేరెను.

---

# రహస్యభేదనము.



దొరగారిభార్యకై యాశించిపోయిన యిరువురు చోరులును రక్షకభటులచే బంధింపబడి చెరసాలలో నుంచబడిరి. స్టేషనులో నున్న రక్షకభటులందరును సోమరిపోతులవలె నిద్రించుచుండిరి. కమలాకరము నివసించుచుండిన గృహము ఖాళీచేయబడెను. రంగనాథమూర్తికి ప్రాణాపాయము కలుగలేదు. కాని, జ్వరతీవ్ర మింకను తగ్గలేదు. ఔషధసేవ జరుగుచునే యుండెను. దొరగారియిల్లు తాళము వేయబడి యుండెను. నాఁడాదివారము. సుదర్శనలాలుమాత్రము కడుశ్రద్ధతో లెక్కలను చూచుకొనుచు గూర్చుండెను. నాఁటి సాయంకాల మైదుగంటలకు మహమ్మదీయుఁ డొకఁడు వచ్చి సుదర్శనలాలునకు నమస్కార మొనర్చి కూర్చుండెను. లాలు లెక్కలు ముగించి యామహమ్మదీయుని జూచి "ఏమండీ! మరల నేమైన వస్తువు తెచ్చితిరా" యనెను.

మహ—చిత్తము.-అని పలికి జేబులోనుండి యొకడాలరు గొలుసు తీసి యాతని కిచ్చెను. లాలు దానిని పరిశీలించి చూచెను. దాని సీలుపాళీమీద "మం. స" యని యున్నది. దానిని చూచి సుదర్శనలా లాశ్చర్యచకితుండై "నవాబుగారూ! వస్తువు చాల పనితనముగ నున్నది. ఎక్కడ చేయించి?" రని ప్రశ్నించెను.

మహ—దీనిని బెజవాడలో చేయించితిని. చాల మంచిబంగారము. కాసులు కరగించి చేయించితిని.

సుదర్శనలాలు గీటు పెట్టుచు "దాదా! త్రాసుతె" మ్మని కేక వేసెను. "నబాబుగారూ! ఇది సుమారు పదికాసు లుండు నను

కొంటాను. సొమ్ము పూర్తిగ నున్నదో లేదో చూచివచ్చెద" నుండు డని చెప్పి లోనికి బోయెను. దాదా, త్రాసు పెట్టెలోనుండి తీసెను. లాలు రహస్యముగ వానిచెవిలో 'అతఁడు దొంగ. రివాల్వరు భద్రపరచుకొనిరమ్ము' అని కొంచెముసేపటిలో తిరిగి వచ్చెను.

మహ—సరిపడు రొక్కమున్నదా?

సుద—ఐదారురూపాయలు తక్కువ వచ్చునేమో! భయము లేదు. తెప్పించెదను లెండు.

ఇంతలో త్రాసు తీసికొని దాదా వచ్చి త్రాసును లాలు కందిచ్చి వీధిగుమ్మమువద్దకు వచ్చి నలుప్రక్కల పరికించెను. ఎవ్వరును లేరు. తిరిగి వచ్చి పేపరు తీసి చదువుచు నొకచో నిలచిపోయెను.

సుద—అయ్యా! దీనిపై నేదియో పేరున్నది. ఈవస్తువు దొంగవస్తువని యనుమానముగ నున్నది. కావున నా కవసరములేదు.

ఆపలుకులు వినినంత నాతడు చకితుండై పోయెను. తనరహస్యము బయలుపడె ననియు, లాలును విడచినచో నాతఁడు తన్ను పోలీసులకు నప్పగింపక మానడనియు తలంచి, చటుక్కున మొలనుండి బాకు తీసి సుదర్శనలాలును సమీపించుచుండెను. ఆస్థితిచూచి దాదా, రివాల్వరు నాతనికి గురిపెట్టి, మేఘగంభీరస్వరముతో, "దుర్మార్గుడా! అడుగు కదిపిన చచ్చెద" వని గర్జించెను. ఆ మహమ్మదీయుడు భీతుండై నిలచిపోయెను. వెంటనే యాతని బంధించి యొకశిలానిర్మితమగు గదియందు పడద్రోచి తలుపుల బంధించివైచెను.

తెల్లవారినది. పదిగంటలకు మహావేగమున నాల్గుమోటారు బండ్లు భవానీచలపాళెంతారిన్యాయసదనమునకు పోవుచుండెను. వానిలోని మనుజులెవ్వరో గుర్తింప వీలులేకుండెను. మార్గమధ్యమునందగులు కోయపల్లెలలోని కోయ లందరును యాసవ్వడి విని యాశ్చర్యమున నేవియో వింతమృగములు వచ్చుచున్నవని తలచి బయటకు వచ్చి

చూచుచుండిరి. కారులుమాత్రము శరవేగమున పోవుచుండెను. పాఠకులారా! వారు పోలీసుశాఖవారని యూహించిన పొరపాటగు నేమో! పోనిండు మనమే నిర్ధారణ చేయవలెను. సమయము వచ్చినప్పుడు వారే బయలుపడగలరు. కారు లన్నియు నొకకొండ మొదట నాగిపోయినవి. ఇప్పుడు లోపలివారిని బాగుగ చూడవచ్చును. లోపలినుండి యందరును దిగిరి. అందఱును పోలీసుశాఖవారే. వారు ధరించినవస్త్రము లొకే రంగులోనివి. వారి నందరను మనము బాగుగ నెరుంగుదుము, కమలాకరము - సూపరింటెండెంటుదొర. రంగనాథ మూర్తి యొకకారునుండి దిగిరి. మిగిలినవాళ్లు కారులనుండియు నలుబది మంది రక్షకభటులు లాయుధపాణులై దిగిరి. వారెల్లరును బిలద్వారము తెరచి లోన ప్రవేశించి యువిరకాలములో పైనున్నమైదానప్రదేశము చేరిరి. కమలాకరము, వారు వారు చేయవలసిన పను లన్నియు బోధించి పంపివైచెను. దొరగారు, తాను, యిరువురు రక్షకభటులు మాత్రము గృహద్వారముగుండా లోన ప్రవేశించిరి.

పాఠకులారా! ఆగృహమున నొకసుందరమైన గది యున్నదని తెలిపితిమిగదా! ఆమంచపుకోడున కొకసుందరి బంధింపబడి యుండెను. కమలాకర మామెను చూచినంతనే చిరునవ్వుతో, "ఓహో! దొర సానిగారా! ఇట్లు బంధింపబడితి రేమి? మీదొరగా రెక్కడ?" యని పంశ్నించెను. ఆయువతి సిగ్గున తలవంచుకొని నేత్రములవెంట నశ్రు జలములు జలజల రాలుచుండ, "కమలాకరమా! నాప్రాణముల నిలువ బెట్టితివి. నీవిపుడు రాకున్న మరొకక్షణమునకు నేను కాలునిపట్టణం బున కతిథినై యుందును. నీకు నేనొనర్చిన మోసమును పరిగణింపక నన్నాదురాత్ముని బారినుండి రక్షింపుము. నాపాపములకుం దగినప్రతి ఫల మిచ్చుటనే యనుభవించితిని. దుర్మార్గుడగు నీమల్లిఖార్జునునిచే మోసగింపబడి నాకులమునకు కళంకము తెచ్చుకొంటిని. నాబంధముల

విదళించుము. మనము త్వరగ పోయినగాని లక్ష్మీకాంతమును రక్షింప జాలము. కమలాకరం! మోసము కా దని త్రికరణశుద్ధిగ ప్రమాణము చేయుచుంటి" నని దీనవదనయై ప్రార్థించుచున్న యామెనుగాంచి జాలిపడి కమలాకర మామెబంధముల తొలగించెను. వా రందరును నచ్చటనుండి బయలుదేరిరి. కమలాకర మాతలుపుల నన్నియు బంధించి వారిని కలసికొనెను.

లోన లక్ష్మీకాంతము బంధింపఁబడిన గదిలో మల్లిఖార్జునుఁడు భీకరాకారుఁడై కత్తి చేతబూని, "నీచురాలా! నీ కాసుగుణమణిబోధనలు బాగుగ చెవికెక్కెను గాదా! ఆహితవు లన్నియు నీమృత్యువు కొరకే. నేటితో నీపాత్ర రంగస్థలమునుండి లోపింప జేసెదను. నీకు దిక్కెవ్వరు గలరో చూచెద. నీయిష్టదైవమును ప్రార్థించుకొ" మ్మని గద్దించుచు కత్తి నెత్తెను. ఆహా కాలమహిమ! కాంత మెన్ని యిక్కట్టులకు లోనయ్యెను!

మల్లిఖార్జును డొనరించుచున్న భీకరాట్టహాసమును విని సుగుణమణి, కమలాకరాదుల హెచ్చరించుచు వడివడిగ పోయి లక్ష్మీకాంతమును ఖండింప సిద్ధముగానున్న మల్లిఖార్జుని కరముగ ట్టిగ పట్టుకొనెను. ఆత డదరిపడి వెనుదిరిగి, "ఓసీ!దుర్మార్గురాలా! కట్లుత్రెంచుకొని మరల వచ్చితివా? " యని యామెజుట్టు పట్టుకొని క్రిందకు పడద్రోసెను. ఇంతలో కమలాకరము వచ్చి రివాల్వరు చూపించుచు "హంతకుఁడా! నిలువుము. కదలినచో చచ్చెద" వని గర్జించెను. మల్లిఖార్జును డించుకంతయైన చలింపక 'శివాజీ' యని కేకవైచెను. ఆకేక విని నంతనే సూపరింటెండెంటువారిగ బిగిలు నూదెను. రక్షకభటులు చోరుల నందరను నాహంతకుని యెదుట నిలువబెట్టిరి.

భయాతురయై స్మృతిలేక పడిపోయిన లక్ష్మీకాంతము తెలివిగాంచి యెదుటనున్న సూపరింటెండెంటును గాంచి పరుగుపరుగున వచ్చి

యాతని కౌగిలించుకొనెను. ఆతఁడామెను నోదార్చుచు, "బిడ్డా! భయ పడకుము." అని యామెను రంగనాథమూర్తికి నప్పగించెను. అను చరు లందరును బంధితులైరి. తన్ను రక్షించువా రెవ్వరునులేరు. పారి పోవుట కాగదికి వేరొకమార్గములేదు. ధైర్యము తెచ్చుకొని చేత నున్న కత్తిని కమలాకరమునకు గురిపెట్టి విసరెను. ఆహా! కమలా కరము మరణింపవలసిన దేనా! కమలాకరము చేతిలోని రివాల్వరు 'ఢాం' మని ప్రేలెను. ఆదెబ్బ మల్లిఖార్జునుని మోకాలును భేదించెను. వెంటనే వేరొకరివాల్వరు ప్రేలెను. ఆదెబ్బ కమలాకరునివైపు వచ్చు చున్న కరవాలమునకు తగిలి, యదిపోయి యెదుటనున్న గోడపై బడెను. ఆకాల్చినవా రెవరు? అర్జునుబాణముల్లు తనకుతుక ఖండింప నరుదెంచు చున్న ఖడ్గమును తునియలు గావించిన యామహావీరుఁ డెవరాయని తలపోయుచు కమలాకరము ప్రక్కకు చూచెను. చేత రివాల్వరు ధరి యించి యభిమన్యకుమారునివలె మెరయుచు సుదర్శనలాలు ప్రత్య క్ష మయ్యెను. మల్లిఖార్జునుని బంధింప నాజ్ఞాపించి కమలాకరము లాలును కౌగిలించుకొని "మిత్రుడా! న న్నాపదనుండి రక్షించితివి. నీసాహసము శ్లాఘాపాత్రము" అని ప్రశంసించెను. అంత వా రంద రును సంతోషముతో నాబంధితుల వెంటబెట్టుకొని యాగృహమందలియు జాగరూకులై బంధించి, బిలమార్గమున క్రిందకు వచ్చి, యచట తమకొ రకై వేచియున్న మోటారుబండ్లపై బయలుదేరి యచిరకాలమున భద్రాచలము చేరిరి. బంధితులను కారాగృహబద్ధులఁగావించి వారెల్ల రు నారాత్రి యొకరియింటివద్ద వారు సుఖముగ పరుండిరి.కమలాకరము తనయనుచరుని సామానులసహితముగా సూనవరముపంపి తా నున్నబస ఖాళీచేయుటచేత సుదర్శనలాలుచే నాహ్వానితుఁడై, సుగుణమణి, లక్ష్మీ కాంతములను వెంటబెట్టుకొని లాలుగృహమున కరిగెను. వీరరాక యుం తకు పూర్వమే విని దాదా, యెల్లరకును మృష్టాన్నభోజనముల సిద్ధ పరచెను.

అందరును లోన ప్రవేశించిరి. సుదర్శనలాలు "మిత్రులారా! సోదరీమణులారా! నేటితో నాకష్టములన్నియు గట్టెక్కినవి. సంతోష చిహ్నముగ మీకందరకును విందొనర్ప నిశ్చయించుకొంటిని. నేను మారువాడి నను సంశయము మీహృదయములనుండి పారద్రోలి నా యభీష్ట మీడేర్చుడు సుగుణమణి వేశ్యయైనను యగ్రజన్ముడనను యహంభావము వదలి నే నామెసరసను భుజించుట కెంతమాత్రమును జంక"ననెను. సుదర్శనలా లగ్రజన్ముడని విని కమలాకర మాశ్చర్య పడెను. సుగుణమణి వేశ్యయని యీతని కెట్లు తెలిసెను? ఈతడు మారువాడీ సుందర్శనలాలు కాకున్నచో నీతని నిజస్వరూపనామము లేవై యుండును? నాకు తా నాభరణముల నద్దెకు గొనుటకు వచ్చినప్పుడుకూడ నీతడు తనజన్మవృత్తాంత మొంగింపలేదు. ఆత డాశ్చర్యమున తో "అయ్యా! భుజించుటకు మాకెవ్వరికి నాటంకము లేదు కాని మీనిజవృత్తాంత మెరుంగ నామన మభిలషించుచున్నది" యనెను. సుదర్శనలాలు "క్షమింపుడు. రేపు విచారణసమయమునగాని వెల్లడింపదల చుకొనలేదు. ఈసుగుణమణి చరిత్రకూడ యత్యద్భుత మైనది. పవిత్రమైనది. అట్టి యీమె చోరులలో గలసియుండుట శోచనీయముగ నున్నది"యనెను సుగుణమణి సిగ్గుపడి తలవంచుకొనెను.

దాదాయాజ్ఞపై నందరును భోజనములకు లేచిరి. మృష్టాన్నములారగించి తృప్తులై యందరును చావడిలో దాదా యేర్పరచిన శయ్యలపై నిష్టాగోష్ఠి సల్పుచు నడుములు వాల్చిరి. అందరును నిద్రించిరి. కాని లక్ష్మీకాంతముమాత్రము 'సుదర్సనలా లెవరై యుండునా' యని ధ్యానించుచుండెను. అతనిం గాంచినంతనే యీమెహృదయము మాకర్షింపబడెను, ఆత్మీయపిశాచ మొక్కటామె హృదయమున పీడింపసాగెను.



# విచారణ.

మరునాఁడుదయముననే రక్షకభటులు లాకొండపై నున్నశిథిల గృహమండలి వస్తువాహనధనాదు లన్నియుఁ దెచ్చి ఠాణాలో నుంచిరి. పదునొకండుగంటలగుసరికి న్యాయస్థాన మంతయు నిసుక వైచిన రాల కుండ పౌరవర్యులచే నిండిపోయెను. అందరును చోరాగ్రేసరులఁ దిలకింప నువ్విళ్ళూరుచుండిరి. న్యాయాధికారి వచ్చి తన పీఠము నలంకరించెను. సూపరింటెండెంటు దొరగారు లేచి యీవిధముగ నుడువసాగిరి.

“అభియోగము:. 16 వ, జనవరి 1934 న, తేదీని నైజాము యిలాకా నెల్లిపాక గ్రామకాపురస్థులు బ్రాహ్మణులు దామోదర శాస్త్రిగారును, భార్య సత్యవతియు, కుమార్తె లలితయు, అల్లుడు సర్వేశ్వరరావు, అల్లునిచెల్లెలు లక్ష్మీకాంతమ్మ- వీ రైదుగురు రెండెడ్ల బండిలో వచ్చుచుండ తెల్లవారుఝామున దేవరపల్లిగుట్టవద్ద చోరు లడ్డము వచ్చి వారివద్దనున్న నగలును ధనమును దోచుకొనిపోయిరి. పోయినవస్తువుల వివరము — రెండుకంటెలు-ఒక్కొక్కటి పదికాసుల యెత్తుగలవి-అందొకదానిపై “కా॥ స” యని గుర్తున్నది:

మువ్వలయొడ్డాణము-ముప్పదికాసులు-“మం॥ స” యను గుర్తు గలదు; రెండుముద్దులజతలు-చంపస్వరములతో సహా;

డాలరుగొలుసు-ఎనిమిదికాసులు- “మం॥ స” పేరు గలదు; వెండిమరచెంబు-60 తులములు; వెండికంచము-40 తులములు; మూడు వెండిగ్లాసులు-ఒక్కొక్కటి పదితులములు- ఒకదానిపై ‘కా॥ స’ యని పేరున్నది; నూటముప్పదియైదు రూపాయిలరొక్కము.

దొంగలవలన నీపైనవివరింపబడిన యాస్తి నంతయు గోల్పోయి

యాత్రాబ్రాహ్మణు డుదయ మెనిమిదిగంటలకు భద్రాచలము పోలీసు స్టేషనులో రిపోర్టుచేసెను. ఆరాత్రి వారు నూపరింకొండెంటు నివసించు భవనమువెనుకనున్న బంగాళా (Rest-House.)లో బసచేసిరి. రెండు ఝాములు దాటినతరువాత వారిలోని లక్ష్మీకాంతమ్మ యను పేరుగల పదునారువత్సరముల యువతి యపహరింపబడెను. ప్రభుత్వము వారిచే పంపబడిన కమలాకరమను డిటెక్టివు పోలీసుశాఖ సహాయమున నా చోరుల బంధించెను. ఇందు మొదటిసాక్షి:- "దమ్ముగూడెం కాపురస్థుడు- నగరం రామారావు." అని చదివి కూర్చుండెను.

వెంటనే రామారావు పిలువబడెను. అత డిట్లు చెప్పదొడంగెను. "సుమారు నెలపదునైదుదినములక్రిందట వీరభద్రస్వామి యనుపేరుగల యొకపెద్దమనిషి నాకు మూడుచుట్టలు యిచ్చి వీనిని రంగనాథమూర్తిగారి కందజేసినచో గొప్పబహుమతి నొసంగెదనని చెప్పి యైదు రూపాయిలు బజానాగా నొసంగెను. నే నట్లు చేయుదమని వానిని దాచితిని. అందులో రెండుచుట్ట లెచ్చటనో పడిపోయినవి. మూడవ దానిని మాత్రమే నావద్దనున్న మరిరెండుచుట్టలతో చేర్చి వారి కందజేసితిని ఆ మనుష్యునిం జూచినచో నానవాలు పట్టగలను" అనెను.

రెండవసాక్షి మారువాడీ సుదర్శనలాలు—

"మాప్రస్తుతనివాసము కూనవరము. దామోదరశాస్త్రిగారి కుమార్తెను నా కొసంగి రెండునెలలక్రిందట వివాహముచేసెను మే మందరమును వచ్చుచుండగనే యీయుభియోగము జరిగెను. మామామగారు వగైరాలను యింటివద్ద దిగవిడిచి యీయభియోగమున పని చేయ నారంభించితిని. నెలదినములక్రిందట ప్రస్తుతమునేను నివసించుచున్న బంగాళా నద్దెకు తీసికొని సుదర్శనలాలను పేరుతో వ్యవహరింపబడుచుంటిని. ఇరువది దినములక్రిందట నొక మహమ్మదీయుం డొక కంటె నావద్దకు తెచ్చి యమ్మజూపెను. అది మాకంటెయే. వెల్లడి

చేసిన మిగతవస్తువులు, మాచెల్లెలు, లభింపరను భయమున నావస్తువును ఖరీ దిచ్చి తీసికొని సగౌరవముగ పంపితిని. అందుచేత నాదివారము సాయంకాలము మరల డాలరుగొలుసు తీసికొనివచ్చెను, అప్పటికి చోరుల రహస్యములన్నియు తెలిసినవనియు మరునాడు పోలీసులు బంధింప నున్నారనియు వినియుండుటచే నామహమ్మదీయుని బంధించి నిన్న ప్రభుత్వమువారికి నప్పగించితిని. నాపేరే సర్వేశ్వరరావు"

మూడవసాక్షి—సుగుణమణి.

"నాది బెజవాడ. కులము వేశ్యాంగనలము. మల్లిఖార్జునరావొక జమీందారు. గౌరవకుటుంబమునకు చెందినవాడు. నే నాతనిసంరక్షణమున నుంటిని. అతిజారుడగుట నాతనిప్రవర్తనము మారిపోయెను. అంతకుముందు ఋణదాతలకు ఒడిసి నాయాస్తి నంతయు నాతనిపేర వ్రాసితిని. అందుచే దుర్మార్గప్రవర్తకుండైనను నే నాతని విడుచుట కవకాశము లేదు. మేము బెజవాడనుండి యారుమాసములక్రిందట యిక్కడకు వచ్చితిమి. భద్రాచలం రిజర్వునందలి రెయొకకొండపయి గల శిథిలగృహములో నివాస మేర్పరచుకొంటిమి. నాటినుండియు నాతడనేకుల మానభంగ మొనర్చెనని వినియుంటిని. లక్ష్మీకాంతమును పదునైదుదినములక్రిందట మాత్రమే చూచితిని. అప్పటినుండి జారవృత్తి పాపదాయకమని మల్లిఖార్జునున కనేకవిధముల బోధించి విఫలమనోరథ నైతిని. తుదకు నిన్న నాహితోపదేశఫలితముగా నన్ను బంధించెను. ఇంతలో రక్షకభటోద్యోగులు వచ్చి వారి నందరను బంధించిరి.

మరియొకవిషయము. ఒకనాడు నానాథు డీకంటె నాకిచ్చి దీనిని సూపరింటెండెంటుగారి యింటిలోనుండి తెచ్చితి నని చెప్పెను"

అని పలుకుచు నొక కంటెను న్యాయాధికారిబల్లపై నుంచెను.

తరువాత ముద్దాయి లందరును విచారింపబడిరి. చివరకు

మల్లిఖార్జునరావుగారకై రంగనాథుడు పోయి యొకశవమును, నొక యుత్తరమును తీసికొనివచ్చి న్యాయాధికారిసమక్షమున నుంచెను. అందరాశ్చర్యమానసులైరి. డాక్టరు శవమును పరీక్షించి విషప్రయోగమనెను. న్యాయాధికారియాజ్ఞపై సూపరింటెండెంటా యుత్తరము నిట్లు చదివెను.

"నానివాసస్థలము బెజవాడ. అచ్చట సుగుణమణి యనువేశ్యను జేరదీసితిని. నే నొకజమీందారుని తనయుడనని వ్రాసికొనుటకు సిగ్గుపడుచున్నను తెలుపక తప్పదు. అతిజారత్వమున బంధుదూరుడనై యిచ్చటకువచ్చి రహస్యముగ నివసించుచుంటిని. [?] పర్వతాగ్రము చేరితిని. కొందరనుచరుల గూడదీసికొని దారులు దోచుచు, యవకాశము లంభించునపుడెల్ల స్త్రీలను చెరచుచు, లేనిచోట్ల ధన మపహరింపుచు జీవించుచుంటిని. ఆకస్మికముగ దామోదరశాస్త్రి యున్నగువారు నాకంటబడిరి. వారిద్రవ్యమంతయు దోచితిమి. మరునాడు భద్రాచలములో లక్ష్మికాంతమును చూచి మోహపరవశుడనై యామెను సంగ్రహించితిని. కాని యామెవలన నా కేసుమంతయు శాంతి కలుగలేదు. ఒకపర్యాయము కమలాకరమును బంధించితిని. పంద్రెండు బారులపిస్తోలునకై రంగనాథమును మోసగించుటకు వీరభద్రస్వామియను పేరుతో దుమ్ముగూడెమున రామారావను చుట్టలదుకాణదారుని సహాయమున సఫలీకృతుడనైతిని. కాని, క్రొత్తనీరు వచ్చి పాతనీటినిదుడుచుకొనిపోయె నన్నట్లు కమలాకరుడు రంగనాథమును విడిపించుకొని పారిపోయెను. నా భార్య-ఉంపుడుకత్తె సుగుణమణి హితవచనంబుల వినక మోహావేశుడనై నందులకు ప్రతిఫలముగ నిప్పుడు చిక్కితిని. కాని పోలీసువారిచే చంపబడుట నీచమని యాత్మహత్య గావించుకొనుచున్నాను. నాపేరనున్న సుగుణమణి యొక్క యాస్తియంతయు Rc 10 5/33 Sub-Registrar offjce, Bezwada.(బెజవాడ సబురిజిస్ట్రారు కచేరీలో

10 5/33,వ నెంబరు)గా రిజిస్టరుచేయబడిన దస్తావేజుదాఖలా యీ స్త్రీ నా మెవళము గావింపగలరు.

ఇట్లు,

చోరాగ్రేసర మల్లిఖార్జునరావు"

న్యాయాధికారి రికార్డులన్నియు కాకినాడ తీర్పునకు పంపించిరి. రిపోర్టుదాఖలా నగలన్నియు కోర్టులో భద్రపరుప నాజ్ఞాపించి వెడలిపోయెను.



# తీర్పు.



విచారణానంతరము పౌరులెల్లరు హాహాకారములతో లేచిరి. మల్లికార్జునుని యనాథత్వదశ— దుర్మోహాబద్ధుఁడై, బంధువిరోధియై, గృహారామాది భోగభాగ్యముల విడనాడి కారాగృహభూయిష్టము, నిర్మానుష్యము, నత్యంతభయావహమునై యున్న ఘోరారణ్యవాసము. ఇవన్నియు తలపోయుచు నంతవాని కిట్టిగతి పట్టెనుగదాయని జాలి పడువారు కొందరు; దైవలిఖిత మెట్లున్న నట్లు కాకమానదు, మానవుని పుట్టించునప్పుడే భగవంతుఁడు వానిజీవితవిధాన మీతీరున పరిణమింప నేర్పరచును, లేకున్న వాని కిట్టి బుద్ధిపుట్టదని కర్మయోగబద్ధులు కొందరును; చతురత యనగా సుగుణమణిదే చతురత, తాను మల్లికార్జునున కనేకవిధంబులతోడునీడై మొదటినుండియు వాని దుష్ప్రవర్తనము సైచి, చివర కాతఁడధఃపతితుఁడగు సమయమున యుక్తితో నాతనిఁ దప్పించుకొని సుఖజీవి యయ్యెనని కొందరును; సర్వేశ్వర కమలాకరముల యప్రతిభాసమోపేత ప్రభావమున కానందాశ్చర్యముల నందువారు కొందరును; లక్ష్మీకాంతమ్మ పాతివ్రత్యదీక్ష—స్త్రీల కలంకారమైన యామెగుణసంపద వర్ణించుచు నామెను సీత, సావిత్రి మున్నగు పుణ్యస్త్రీలకన్న మిన్నగ బేర్కొనుచు, నానందించువారు కొందరును, యీవిధమున నానభాషాటమంతయు బలుతెరంగుల యభిప్రాయములతో నెవరియిండ్లకు వారు చేరిరి.

సర్వేశ్వరరావు, చెల్లెలైన లక్ష్మీకాంతమును గారవించుచు, నీ యభియోగమున విశేషశ్రమ కోర్చి తమకు మహోపకార మొనర్చిన పత్తేదారు కమలాకరముగారిని, సూపరింటెండెంటు దొరగారిని, రంగ

నాథమూర్తిగారిని తమగృహమునకు దయచేసి తాము సంగుచందనతాంబూలాదిసత్కారంబుల గైకొన ప్రార్థించెను. కొన్ని కొన్ని యావశ్యక కార్యము లుండుటచే రంగనాథమూర్తియు రా ననెను. మిగిలిన వారి నందర వెంటబెట్టుకొని నాటిరేయి తా నద్దెకు తీసికొనిన బంగాళా యందే కాలము గడుపనెంచి యింటికి చేరెను. వెంటనే యిరువురు మనుష్యుల, నీ శుభవార్త నత్తమామలకును, తల్లిదండ్రులకును తెలుపుటకై నెల్లిపాక, కూనవరము గ్రామములకు పంపించెను.

మరునాడుదయముననే సర్వేశ్వరరావు పోలీసుద్యోగులను, తన చెల్లెలను వెంటబెట్టుకొని గతదినమున నేర్పరుపబడి తమరాకకై యెదురుచూచుచున్న లాంచినెక్కి మహాసంతోషముతో నెల్లిపాక ప్రయాణమునకు గడంగిరి. లాంచి కదలుటకు సిద్ధముగానున్న సమయమున, కమలము అన్నతో రహస్యముగా, "అన్నా! పాపమా సుగుణమణి నేబంధితనై యున్నప్పు డొకనెలదినములు నన్నాదరించెను ఇట్టిసంతోషసమయమున మనకు మహోపకార మొనర్చిన యాయువతిని విడిచిపోవుటకు నామన మంగీకరించుట లే" దనెను. సర్వేశ్వరరావామెకోరికను కమలాకరాదులతో చెప్పి, తాను సుగుణమణిని తోడ్కొనివచ్చుటకై మరల నూరిలో ప్రవేశించి యామెను దోడ్కొనివచ్చెను. ఇంతలో నొకయువకుడు పరుగుపరుగున వచ్చి, 'యీ లాంచి యెక్కడకు పోవుచున్నది?' యని ప్రశ్నించెను.

భటుడు—ఇది కంట్రాక్టులాంచి. మీరెవ్వరు వెళతారు?

కంట్రాక్టులాంచియని విని యాపురుషునిముఖమువికసించెను. "నెల్లిపాక పోవునా?" యని ప్రశ్నించెను.

భటు—అవును ఎక్కుటకు వీలులే దనుచుండ నీ కెందులకయ్యా యీప్రశ్నలు? సాయంకాలము మరొకలాంచి వెళ్ళుతుంది. దానిమీద వెళ్ళండి

పురు—శోవపడకోయి. దీనిని సర్వేశ్వరరావుగారేనా శంస్త్రాప్తి చేసినది?

ఆప్రశ్న విని లోపల ముచ్చటలాడుచున్న సర్వేశ్వరరా వదరిపడి బయటకు వచ్చెను. గట్టుమీదనున్న పురుషుని గాంచినంతనే యాతని హృదయమున సంతోషతరంగము లుప్పతించి ప్రబలిపోయెను. వెంటనే క్రిందకు దూకి యాపురుషుని కౌగిలించుకొని "దాదా! ఎక్కడనుండి వచ్చితివి? రమ్ము, లాంచి యెక్కు" మని యాతని గూడ లోని కెక్కించెను.

ఆనూతనపురుషుండే లక్ష్మీకాంతమ్మభర్త. అతనిని చూచినంతనే కాంతమ్మ సిగ్గున లేచి నిలువబడెను. సర్వేశ్వరరావు, సుగుణమణి కాంతమ్మల నాలాంచిలోనున్న ప్రత్యేకగదియందు కూర్చుండ నియమించెను. లాంచి కదలినది. లాంచియందున్న కమలాకరాదులు విలాసముగా ముచ్చటించుకొనుచుండ మాటలసందర్భమున' వీరెవర"ని ప్రశ్నించుచు నాయాగంతకుని చూపెను. సర్వేశ్వరరావు "పత్తేదారు గారూ! ఇతడు నామేనత్తకుమారుడు. మా చెల్లెలు కాంతమ్మ భర్త ఇతడు బెజవాడ మ్యునిసిపల్ ఆఫీసులో గుమాస్తాగా పనిచేయుచు న్నాడు. ఈతనిపేరు నారాయణరావు" యని చెప్పి నారాయణరావు వైపు తిరిగి "బావా! ఎప్పుడు వచ్చితివి? మే మిక్కడ నున్నట్లు నీ కెట్లు తెలిసింది?" యని ప్రశ్నించెను.

నారాయణరా విట్లు చెప్పదొడంగెను. "మీచెల్లెలు పదిదిన ములలో తిరిగి వచ్చెదనని చెప్పి నీపెళ్ళికి వచ్చింది. పదిలేదు-పది హేనులేదు. మనుగుడుపులు మొదలైన ముచ్చట్లన్నీ యుండగా అది చెప్పినట్లు రావడాని కెల్లాగా వీలుపడదని యుపేక్షచేసి యూరకున్నాను నెలదినములైనా మీదగ్గరనుండి యుత్తరమైనా లేదు. నా కేమో

బెంగతోచింది. వెంటనే మీనాయనగారి కొకయుత్తరం వ్రాశాను. దానికి జబాబు లేదు. నాల్గురోజులాగి మరో కార్డు వ్రాశాను. దానికి కూడా జబాబు లేదు. ఈవిధము ఈరెండుమాసాల్లోను సుమారు పదిహేనుత్తరాలదాకా వ్రాశాను కాని జవాబు లేకపోయింది. వారంరోజులు సెలవు తీసుకొని కూనవరగాని వద్దామని యాలోచించి మాకమీషనర్ దొరగారిని అడిగితే ఒకవారంరోజులు వెళ్ళిన తరువాత వెళ్ళమన్నారు. ఆరోజున సాయంకాలము నాస్నేహితునితో కలసి కృష్ణయొడ్డుకు వెళుతూండగా యెవ్వరో ఒకఉత్తరం తీసుకవచ్చి యీతని కిచ్చాడు. అతను దానిని విప్పి చదివాడు. అది భద్రాచలము నుంచే సుగుణమణి అనే స్త్రీ వ్రాసింది."

తనపే రుచ్చరింపబడుటచే సుగుణమణి యానూతనపురుషుని ద్వారముగుండా పరిశీలించి చిరునవ్వు నవ్వుకొనెను.

నారాయణరావు చెప్పదొడంగెను. "తాను నాస్నేహితుని దయవల్ల సమస్తపుణ్యతీర్థములు సేవించి రెండురోజులక్రిందట భద్రాచలము చేరినట్లున్ను, బెజవాడనుండి పారిపోయివచ్చిన జమీందారు కొడుకు మల్లిభార్జునం ఇక్కడ గొప్పగొప్ప నేరాలుచేస్తూ యుండడం హడావిడివల నొంటరిగ వచ్చుటకు భయమగుచున్నదనియు, దారిలో వాళ్ళని దోచి అంతతో యూరకొనక ఆబండిలోనున్న లక్ష్మీకాంతమ్మ యనేపిల్ల నెత్తుక పోయినట్లును, ఆమెఅన్నగారికి క్రొత్తగ వివాహమై మనుగుడుపులకు పోవుచుండగా దారిలో యీఘోరము జరిగినదనిన్నీ మొదలైనవిషయములన్నీ వ్రాస్తూ నాస్నేహితుణ్ణి స్వయముగాగాని లేక వేరొకరి సహాయముగాని సురక్షితముగ బెజవాడ చేరుయేర్పాటు చేయవలసినదనియు కోరుచు వ్రాసెను. ఆసుగుణమణి బెజవాడలో నుండగా నామిత్రునితో పాటు నేను కూడ రెండుమూడుసారు లామె

యింటికి పోయియుంటిని. ఆమె వ్రాసినయుత్తరములోని లక్ష్మీకాంతమ్మ అన్నవివాహము మొదలగు కొన్నివిషయములు నా కాందోళన కలిగించెను. వెంటనే జీతముపోయినాసరే యని సెలవుచీటీ వడవైచి ఉదయాన్నే అశ్వారావుపేట మీదుగా గూనవరం చేరుకొన్నాను. నన్ను చూచి అత్తగారు మామయ్యా ఏడవడం ప్రారంభించారు. జరిగినదంతా చెప్పారు. వెంటనే బయలుదేరి కారుమీద యిక్కడికి వచ్చాను. కోర్టులో వాకబుచేయగా విచారణ అయిపోయిందనిన్నీ, సర్వేశ్వరరావు పద్దెరాలు ఇప్పుడే లాంచిమీద వెళ్ళడాని కేర్పాటు చేసుకొన్నారనిన్నీ, యచ్చటనున్న గుమాస్తా చెప్పెను. నేను వచ్చేటప్పుడు నాన్నేహితుడు భద్రాచలం వెళ్ళినట్లయితే సుగుణమణిని కలసికొని కొన్నివిషయములు చెప్పుచున్నాడు కాని, లాంచి దాటిపోతుందనిన్నీ, మళ్లీ వచ్చేటప్పుడు మాట్లాడవచ్చుననిన్నీ ఆలోచించి బయలుదేరి వచ్చాను'' అనెను.

కమలాకరాదులు నారాయణరావు చెప్పినవృత్తాంతము విని సుగుణమణి యుపాయమునకు, నాయుత్తరములోని విషయములకు పక్కున నవ్వసాగిరి. కాని, కమలాకరుని సంజ్ఞచే నెవ్వరును సుగుణమణి నిజవృత్తాంత మాతని కెరింగింపలేదు. లోన లక్ష్మీకాంతముకూడ నవ్వసాగెను. ఆమె తనభర్తతో తనచరిత్రము వెల్లడించినచో నాతని వలన నాతనిమిత్రుని కీవిషయ మెరింగి తన్ను నిరాకరించునని భయపడి కాంతమ్మతో, "సోదరీ! నేను సుఖనై యుండవలయునని నీ కభిప్రాయమున్నచో నానిజవృత్తాంతమును నీభర్త కెఱింగింపకు" మని యామెను బ్రతిమాలి యామెచే నొట్టు పెట్టించుకొనెను. కాంతముకూడ నెల దినములు తన్ను బంధించినపుడు తన కాహారపానీయాదుల నొసంగిన విశ్వాసముచే నామె సుగుణమణిచరిత్ర వెల్లడింపనని శపథము చేసెను.

లాంచి నెల్లిపాక రేవుచేరెను. అందరును లాంచి దిగిరి. వారి రాక మున్ముందుగనే వినియుండుటచే దామోదరశాస్త్రి తనమిత్రులతో వారిరాక కెదురుచూచుచు వారినందరను సగౌరవముగ నింటికి తోడ్కొనిపోయెను. నాఁడుమొదలు వారముదినములవరకు కమలాకరాదులు దామోదరశాస్త్రి కోర్కెపై నచ్చటనే నిలచిపోయిరి. ఈవారముదినములలో పాపము సుగుణమణి తనప్రియునివిషయమై నారాయణరావును కలిసికొని ముచ్చటించవలయునని యభిలషించుచుండెనుగాని వీలు చిక్కినదికాదు. ఒకనాటిసాయంకాల మాతఁడొంటరిగ చల్లగాలికై వారియింటిప్రక్కనున్న మైదానమున కూర్చుండియుండ సుగుణమణి మెల్లగ నచ్చట కరిగి కొంచెముదూరమున నొకచెట్టు నానుకొని నిలువబడి, "రావుగారూ! మీస్నేహితుఁడు నాయుత్తరమున కేమని ప్రత్యుత్తర మిచ్చెను?" యని ప్రశ్నించెను. ఎప్పుడును స్త్రీలతో సంభాషించు నెరుగని నారాయణరావట్లనడయమున నాస్త్రీతో—అందున, కులాంగనకాదు— వేశ్యాంగనతో మాట్లాడుటయనిన చాల తొట్రుపడెను. కాని,యామె తనపిరికితనమునకు పరిహాసించునని తలచి "సుగుణా! రా. కూర్చో. అట్లానిలబడ్డావేం?" యనెను. ఆమె చిరునవ్వుతో దూరమున కూర్చుండి పై విషయమునే మరల ప్రశ్నించెను.

నారా— మీరంతుల్ని రాజమండ్రీ బదిలీ చేశారు. ఈనెలాఖరున బెజవాడలో ఛార్జి నప్పగించి రాజమండ్రి వెడతాడు. నీవు యిల్లు,వాకలి వదలి ఉండదలచుకొంటే యీనెలాఖరుకి రాజమండ్రీరమ్మని చెప్పుమన్నాఁడు ఒకటిరెండురోజులు ముందు వెళ్ళినట్లయితే నాళంవారి సత్రములో అతనిపేరు చెప్పి గది తీసికొని అందులో బసచెయ్యి మన్నాడు. ఏసంగతీ మళ్ళీ తెలుసుకొని రమ్మన్నాఁడు.

సుగుణమణి సంతోషముతో చిఱునవ్వు నవ్వెను. ఇంతలో

కాంతము దూరమునుండి "సుగుణా! అన్నయ్య పిలుస్తా" డనెను. సుగుణ లేచి వెళ్ళిపోయెను.

మరునాడుదయమున రంగనాథమువద్దనుండి జవా నొక డొక యుత్తరమును తెచ్చి సూపరింటెండెంటుదొరగారి కిచ్చెను. అందు మరునాడు న్యాయాధికారి తీర్పు చెప్పుననియు, అందరును రావలయుననియు నుండెను. నాటిమధ్యాహ్న మందరును బయలుదేరి భద్రాచలము చేరిరి.

మరల న్యాయస్థానము ప్రేక్షకులచే నిండిపోయెను. న్యాయాధికారి యుత్తరువుపై గుమస్తా పైనుండి వచ్చిన తీర్పుపత్రికనిట్లు చదివెను.

"ది. 16—1—34 వ తేదీని భద్రాచలము సమీపమునగల దేవరపల్లి గుట్టవద్ద జరిగిన యభియోగమునందలి విచారణాఫలితములు.

ది 24—3—34 వ తేదీని పంపబడిన రికార్డులనుబట్టి యీ క్రిందివిధముగా తీర్పు యీయఁబడెను—

మొదటిసాక్షి చుట్టలదుకాణదారు రామారావునకు నింకముందెన్నడును నిట్లు ప్రభుత్వోద్యోగుల మోసగింపకుండనట్లు బుద్ధి వచ్చుటకై రూ 10 అపరాధము.

రెండు మూడుసాక్షులు ప్రభుత్వమునకు సహాయ మొనరిచినందున వారి కెట్టియపరాధమును విధింపబడలేదు.

చోరు లందరకును ఒక్కొక్కరికి నాలుగేసి సంవత్సరములు ఖైదు విధింపబడెను.

మల్లిఖార్జునుని వాఙ్మూలముప్రకారము సుగుణమణి యాస్తి సుగుణమణికిని, అభియోగమునందలి లిస్టుదాఖలాయాస్తి దామోదరశాస్త్రికిని, సూపరింటెండెంటుదొరగారికంటె వారికిన్ని యొసంగబడునట్లున్నా.

ది.26—3—34వ, తేదీని పౌరులు పంపుకొన్న మహజరు

ననుసరించి చోరులగృహమున దొరకిన యితరాస్తులన్నియు శ్రీభద్రాచల దేవాలయాధికారులకు శ్రీరామునికైంకర్యముగా నప్పగించివారిచే నాజాబితాపై చేవ్రాలు చేయించి ఆఫీసునకు పంపునట్లున్నా తీర్పు యీయఁబడెను—" అని చదివి కూర్చుండెను.

ఆతీర్పువిని యందరును సంతోషాంతరంగులైరి. న్యాయస్థానమువదలి వేరేరుకు వెళ్లిరు సంతోషమున ముచ్చటలాడుకొనుచు నిండ్లకుఁబోయిరి. సర్వేశ్వర నారాయణరావులు కమలాకరాములవద్ద సెలవుగైకొని మరల నెల్లిపాక చేరిరి.



# ఉపసంహారము.

తీర్పుప్రకారము ఎవరియాస్తి వారికి వప్పగించిరి దేవాలయము నకుగూడ సుమారు 10 వేలరూపాయిలు విలువగల యాస్తి లభించెను. చోరు లందరును రాజమహేంద్రవరము సెంట్రలుజైలునకు పంపబడిరి.

నారాయణరావు సర్వేశ్వరరావులు దామోదరశాస్త్రివద్ద సెలవుగైకొని లక్ష్మీకాంతము సుగుణమణులతో బయలుదేరి కూన వరము చేరుకొని యచ్చటిబంధువులకందఱకును సంతోషము గల్గించిరి. నాల్గుదినము లచటనుండి నారాయణరావు భార్యా సుగుణమణుల దోడ్కొని రాజమహేంద్రవరము వచ్చెను. నాళంవారిసత్రంలో సుగుణమణికిఁ దగుసదుపాయముల నెల్ల గావించి భార్యాద్వితీయుఁడై బెజవాడ చేరెను. మరునా డాతనిమిత్రుఁడు రాజమండ్రి వచ్చి సుగుణమ ణిని దనబసకు గైకొని పోయి సుఖంబుండెను.

అందఱును సౌఖ్యపరంపరల నోలలాడుచుండిరి.

సంపూర్ణము.



# ఆఫీసులో హత్య



గ్రంథకర్త:— జె. వి. రాధాకృష్ణన్‌గారు.

నవలలు—అందులో సాంఘికమని, చారిత్రికమని, పరిశోధకము లని ఎన్నో నవలలు వెలువడుచున్న యీ రోజులలో నవలాపాఠకుల నత్యధికముగ నాకర్షినది పరిశోధకనవలలే యైయున్నవి. ప్రస్తుతకాలమున వెలువడుచున్న డిటెక్టివునవలలలో మొదటిపుటలోనే హంతకు డెవరో తెలిసి పోవుచున్నది. అట్లుగాకుండ ప్రతిపుటయు పదిమార్లు చదువవలెననెడి యభిలాష—తుదివరకు విడువకుండ చదువుకోరిక యీ నవల కలిగింపగలదు.

మామూలు డిటెక్టివునవలలవలెగాక ఇది శ్రోత్రపంథాలో వ్రాయబడినది. విఖ్యాతవంగదేశపు రహస్యాపరాధపరిశోధకుడు నగేంద్రబాబే యీ ఝటిలమైన హత్యారహస్యము భేదించినాడు. ఆఫీసులో హత్య యెందులకు జరిగినది? ఎవరిని హత్యచేసినారు? ఎప్పుడు హత్యచేసినారు? అను ప్రశ్నలు పుస్తకమును చూచినంతనే బయలువడక మానవు.

ఆఫీసులో 9..30 గంటల వేళ- అందులో ప్రజాబాహుళ్యమున కనువైన మదరాసు మౌంటురోడ్డులో 183 నెం॥ భవనమున జరిగిన యీ హత్యారహస్యము చదువరుల మనస్సుల కాందోళనము కలిగించి తుదకు మహదానందము కలిగించును. చౌర్యమునకై అయిదేండ్లు శిక్షవిధింపబడిన గోవిందరాము అను దొంగకథ యెంతచక్కగా వ్రాయబడినది మీకే బోధపడగలదు. [వెల 1—0—0. ]

## కర్రా అచ్చయ్య అండ్ సన్సు,

ఈశ్వర బుక్ డిపో, రాజమండ్రి.

# కోకిల—ఎల్. ఎమ్. ఎస్.,

## గ్రంథకర్త:— జె. వి. రాధాకృష్ణ గారు.

**అద్భుత** సంఘటనలతోఁ గూడిన చక్కని నిరూపకనవల. పేరులో నెంత మాధుర్యమున్నదో-ఆమెలో నంత క్రౌర్యమున్నది. మనస్సులో నెంత విషమున్నదో-మాటలో నంత తీపియున్నది. అదేమి!-ప్రేమయా?-అనంతమైన ప్రేమ-అపారమైన ప్రేమ—

ఆప్రేమకొఱకు-సుందరాంగి-సుకుమారి-శిరీషకుసుమపేశల హృదయ-జానకీదేవి-సుందరేశయ్యరుభార్య - నిష్కారణముగా బలి యీయఁబడినది.

దుర్బలహృదయుఁడు-అయ్యరు కోకిలమాట ధిక్కరించలేకపోయినాఁడు-ఎంతెంత దారుణములు జరిగినను జూచుచు నూరకుండినాఁడు-అతని ప్రేమనందుట కెన్నిహత్యలు! ఎన్నిసాహసకార్యములు? సెక్రెటరీగా నున్న వాసంతిక-ప్రైవేటు డిటెక్టివు శివరాము-

అకారణముగా హత్యాపరాధము మోపఁబడిన గురునాథను, అయ్యరు, భవనములోని రహస్యముల నరసినారా?

ఇవి యన్నియు నొడలు జలదరింపఁజేయఁగలిగిన యీభయంకర నిరూపక నవలారాజములోఁ జదువఁగలరు. అడుగడుగునకు నాశ్చర్యమే. ఆఖరునకీ ప్రేమపిపాసి కోకిల యేమైనదో తెలిసికొని-స్త్రీ హృదయమిట్టిదికదాయని గ్రహింపవచ్చును. డిటెక్టివు నవలలో నింతవఱకు నీమాదిరినవల ప్రచురితమై యుండలేదు.

వెల రు. 1—0—0

వలయువారు:—

కర్రా అచ్చయ్యా అండు సన్స్,

ఈశ్వర బుక్కు డిపో,

రాజమండ్రి.

# భయంకర ధనాశాపిశాచము

గ్రంథకర్త్రి:— ఆచంట సత్యవతీదేవిగారు

ఆంధ్రదేశమున సంఘసంస్కరణము లతి బాహుళ్యముగ నానాటికి మారుచున్నవి. అట్టి తరుణమున సర్వజనగ్రాహ్యమగు భాషలో సాంఘిక నవలలను బ్రచురించు టత్యావశ్యకమేయని లోకము గ్రహింపకమానరు. అందు మానవుడొక పరమాణువు. అట్టి వానికి భగవంతుడు ధర్మార్థకామ మోక్షంబులనియెడి నాలుగు పురుషార్థములను సృజించినాడు. అందీ కలికాలంబున అర్థకామములందు తృష్ణలేని వారరుదు. అందర్థార్జనకయి వేనవేలు దుష్కృత్యము లొనర్తురు. అందువలననే 'ధనమూల మిదం జగత్' అని పెద్దలు నుడివియున్నారు. ఈ మా ప్రస్తుత నవలారాజమున నట్టి కథానకమే తెనుగునాడును పురస్కరించుకొని యాబాలగోపాల మర్థించునటుల నొక ఆంధ్ర కవయిత్రిచే వ్రాయబడినది.

ఈనవలయందు ధనాశాపిశాచ పీడితుడగు పాపారాయుడొనర్చిన మిత్రద్రోహము మొదలగు దుండగములు చదువవలసినదేకాని వ్రాయనలవికాదు. పాపారాయుడు మోడినర్తకుడగు సత్యవంతుని సత్యసంధత, అతని భార్య సుశీల నడవడి, పాపారాయుడు తన నమ్మినబంటగు అప్పన్నచే సత్యవంతుని సముద్రమున ద్రోయించుట, సత్యవంతుడు పునర్జీవితుడగుట, ఆసంగతి తెలియక సుశీల సహగమనమునకు సిద్ధపడుచుండ సత్యవంతుడు హఠాత్తుగావచ్చుట, సాధుసంతర్పణ, పాపమునకు దగిన ప్రాయశ్చిత్తము, హేమామాధవుల ప్రేమతత్త్వము, మొదలగు ననేక సంఘ దురాచార నిర్మూలనములును, ప్రణయపూరితములును, నీతిబోధకములునగు విషయంబుల నిండి చదువరుల పాలిటి బంగారు పేటిక యనదగి యలరారుచున్నది. బాలబాలికలును, యువతీయువకులును, ప్రౌఢలును, కౌమారులును తప్పక చదువతగినది. వేయేల! నేటి సాంఘిక నవలలకు నాయకమణి. చదివినతర్వాత పైయంశములను మీరే గ్రహించి యిట్టి నవల నింకొక దాని నెప్పుడు ప్రచురింతురని వ్రాయుదురు. నేడే యొక ప్రతినిగొనుడు. వెల రు. 1—0—0.

---